ఫల్గుణా పిక్చర్స్ వారి



# జగత్ కిలాడీలు

దర్శకత్వం
ఐ.యస్.మూర్తి

నిర్మాతలు
పి.ఏకామ్రేశ్వరరావు బి.ఏ.
కె.రాఘవ

కిలాడీలురా-జగత్ కిలాడీలురా
ఒకరికన్న ఒకరు భలే
కిలాడీలురా

తప్పక చూడండి!

ఆంధ్ర-నైజాం
లక్ష్మీ ఫిలింస్
విడుదల
నవభారత్
మైసూరు
జెయాస్



LAKSHMI

పై వారమే!

# వినాయకచవితి

## హాస్యసంచిక



మన హాస్య నటీనటులు

కార్టూన్‌లు

కార్టూన్ గేయాలు

స్వగతాలు

కార్టూనిస్టూ - కాలేజిగర్లూ

భూమే గుండ్రం



ఇంకా ఎన్నో ఆకర్షణలు

ఎక్కువ పేజీలు * వెల మామూలే

# ఉత్తరాలు

### కథలు

'శతభిషం' గారు నా 'నాలుగో వాడు' కథ గురించి రాసినలేఖ చదివాను. పత్రికల ప్రకటనల విషయంలో వారి 'నమ్మకం' సరి. అయి నదే— ఇక— జనార్ధనానికి పిల్లలు ఎక్కువ మంది అంటే ఒప్పుకుంటారుగానీ— ప్రకటన పంపిం తర్వాత డబ్బు పంపించాలని తెలియదంటే ఒప్పుకోను—జనార్దనం ప్రకటనను 'పోస్‌చేసే'టప్పుడు— ఉత్తరంతో బాటుగా డ్రాఫ్ట్ జతపరిచాడని ఎందుకు అనుకోకూడదు? అయినా— కథ ముగింపు విషయం లోనే కథకులు 'సజెస్టివ్‌నెస్'ను అనుసరిస్తున్న ఈ రోజుల్లో మనియార్డరు ఫారముకొనడం— రసీదు జేబులో వేసుకోవడం రసీదు—ఇవన్నీ రాయాలంటే ఎలా చెప్పండి సార్?—

కోడూరి శ్రీరామమూర్తి (బొబ్బిలి)

### సీరియల్

వెలుగు నీడలు సీరియల్ ముగింపు ఆశించినట్లుగానే జరిగింది. విజయకుమార్ లాంటి మూర్ఖుల వలన ఎంతమంది శశికళలు బలై పోవుచున్నారో! విజయకుమార్‌కు కనువిప్పు కలిగించి తను చేచేతులా పోగొట్టుకునేది ఎంత విలువైనదో తెలుసుకొనేటప్పటికే, ఆమె కనిపించని తీరాలకు వెళ్ళిపోయినట్లు యుంటే సీరియల్‌కు యింకా వన్నె తెచ్చేదని, నా యభిప్రాయము. ఎప్పటికి మరువలేని పాత్ర మధుమూర్తి.

కుమారి ఎం. సాయి (రాయకుదురు)

### వ్యాసాలు

'తెలంగాణ సమస్య'లకు అతిముఖ్యమైన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఇంకో కారణం గురించి వివరిస్తున్నాను. ఆంధ్ర సోదరులు తెలంగాణసోదరులపై చిన్న చూపు చూడటం, దాశరథి, సి. నా. రె, కాళోజి, సురవరం, పోతన, సోమన వానమామలై వరదాచార్యుల వంటి ఉత్తమ కవుల నెలవైన తెలంగాణను గూర్చి తెలియక 'తెలంగాణ'వారికి తెలుగురాదని అభివర్ణించిన కొందరు కుమతులు లేకపోలేదు. ఆంధ్ర సోదరులు అందరూ అలా ప్రవర్తించటం లేదు. కాని కొందరు చేసిన తప్పిదాలు, తమ్ముని మనస్సులో అన్నపై అసంతృప్తికి దారి తీస్తుందని చెప్పటంలో సందేహము లేదు.

నేను చూసిన యదార్థ సంఘటనలు కొన్ని మీకు రాస్తున్నాను. (1) తెలుగు భాషాసంఘం విద్యార్థి— సంఘము అనే విషయంపై ఒక చర్చను నిర్వహించింది. అందులోని వారు చేసిన తీర్మానం తెలంగాణ విద్యార్థులకు అసంతృప్తి కలిగించింది. ముల్కీ రూల్స్‌నురద్దు చేయాలని ఆ తీర్మానంలో ఉంది. సభలో అలజడి మిన్నుముట్టాక ఆ ప్రతిపాదన తీసివేయడం జరిగింది, తెలంగాణా విద్యార్థులు అసహను ఆత్మ

గౌరవానికి నష్టంగా భావించి వాక్‌ఔట్ చేశారు. (2 ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవ సందర్భమున నిర్వహించ బడిన ఒక డిబేట్ పోటీలో, ఆంగ్లలో, ఎన్నిక చేసి కళాశాలనుండి ప్రతినిధిగా పంపబడిన విద్యార్థి ముల్కీరూల్స్ రద్దు చేయాలి అనే మాట చెప్పి ప్రసంగాన్ని ఆపాడు. శీర్షికకు అసలు ముల్కీ రూల్స్‌కు సంబంధమే లేదు. ఇది తెలంగాణ సోదరుల మన స్సులో అసంతృప్తికి దారి తీస్తుందని వేరే చెప్పాలా?

ఈవిధంగా కొందరు సోదరులు చూపిన చిన్న చూపే ఈ ఉద్యమానికి దారి తీసింది. ఆంధ్రేత రులతో కలసి మెలసి తెలంగాణ సోదరులు జీవించటం లేదా! వారు కలసి మెలసి ఉంటారు. స్వ్యానత పరిచే విషయాలను ప్రస్తావించారు. ఈ ఉత్తరం ప్రచురిస్తారని ఆశిస్తున్నాను.

—యస్. వెంకటరంగారెడ్డి (కొల్హాపూర్)

*　　*　　*

మీరు ప్రచురిస్తున్న వ్యాసాలు (తెలంగాణా గురించి) చదువుతుంటే ఇది ఒక పక్షపాత ధోరణి కలిగిన టువంటి పత్రిక అని చెప్పుటకు చింతి స్తున్నాను. పత్రికలో యాదగిరి గారు వ్రాసిన వ్యాసంలో ఆపాటి పనివాళ్ళు ఆంధ్రవారి భవంతులు నిర్మాయించుచున్నారని వ్రాశారు. ఎంత హాస్యాస్ప దమో చూడండి. ఈమాట మూల నున్న ముసలి వాడు కూడ నమ్మడు. ఇంకా వారు వ్రాశారు ఏమంటే 'పోరగాళ్లకు ఇస్కూళ్లకు పంపకండి తెలంగాణా సర్కారు ఊరకనే పాస్ చేస్తది' అని ఈ మాట తెలంగాణా లీడరు— ఇంతవరకు చెప్ప లేదు. మరి వారు ఎవరు చెప్పగా విన్నారో అర్థం, కావడంలేదు, ఒక విషయం ఇక్కడ పాఠశాలలు మాని వేసి స్ట్రైక్ చేస్తున్నప్పుడు ఆంధ్ర వాళ్ళు కూడా ముల్కీ విధానం పాటించాలి అని లారీలపై రిక్షాలపై ఎక్కి తిరిగేరు. వారి సమ్మె విషయాలు విశాఖపట్నం పత్రికలు ఫోటోలతో సహా ప్రచురించాయి కాని తెలంగాణాలో సమ్మె గురించి ఫోటోలు కాదు కదా వాటి వివరాలు కూడా ప్రచురించలేదు. ఏదో పైపైకి మాత్రమే. మరి వార్తాపత్రికలకు కూడా పక్షపాత ధోరణేనా! యాదగిరిగారు తెలం గాణా వారు దుష్ప్రచారం చేస్తున్నారని వ్రాశారు. దుష్ప్రచారాలు చేస్తున్నది ఎవరు? ఆంధ్రా పోలీసులా లేక ప్రాణాలర్పించిన పసికందులా? ఏడు మాసాల నుండి సమ్మె చేస్తున్నామన్న మాటే కాని మా ఒక్క కోరికన్నైనా నెరవేరిందా? ఏది ఏమైనా తమరు మాత్రం తెలంగాణా వార్ని కించపరచే ఉత్తరాలూ ప్రచురించకండి. ఎందుకంటే అవి చదివితే ఇటు వారికి సానుభూతిరాదు సరిగదా ఒకవిధమైన జుగుప్స ఏర్పడుతుంది. ఆ జుగుప్స ఎలా వెళ్ళగక్కాలో మీరు 8—8—69 లో ఎవరో సీతమ్మ వుత్త రంలో చదివే వుంటారు. అందువల్ల తెలంగాణా వారిని గురించి నీచంగా వ్రాసే ఉత్తరాలు ప్రచు రించకండి. ఈ ఉత్తరం మీరు ఎలాగూ ప్రచురి

# ఉత్తరాలు

స్తారని మేమనుకుంటున్నాము.

వి. నరసింహులు
ఎం. ఎ. బాసిత్‌ఖాన్
(నల్గొండ)

*　　*　　*

ఆంధ్ర సచిత్రవారపత్రిక 1—8—69 వ సంచికలో తుఫాను బాధితుల సహాయము ఎస్. టి. ఆర్. ఆర్గనైజేషన్ విషయమై శ్రీ శ్రీనివాస్ గారు ప్రస్తావిస్తూ తుఫానుకు గురి అయిన 5 జిల్లాలలో తెలంగాణా జిల్లా అయిన ఖమ్మం వదలి కోస్తా జిల్లాలకే తీసుకొని యున్నారు. ఖమ్మం జిల్లాలోని మూడు తాలూకాలు తుఫానుకు తీవ్ర నష్టమునకు గురి అయినవి. శ్రీనివాస్ గారెమో ఖమ్మం జిల్లాని వదిలి వేయుటం చాలా శోచనీయ మైన విషయం. అందులో శ్రీ జగ్గయ్యగారు, రామారావుగారు కూడా తమ ఉపన్యాసములలో కోస్తా జిల్లాలనే తీసుకొని యున్నారు. ఎన్. టి. రామారావుగారు ఒక్క ఆంధ్ర జిల్లాల సహాయమే ప్రదర్శనలు ఇచ్చుట విచారకరము. వారి భవిష్యత్తు కోసమై నిర్మించిన ఎస్టేట్ మరియు స్టూడియో కూడ తెలంగాణాలోనే యున్నది. సహృదయులు, పరోపకార పరాయణులు, ప్రజాబాంధవుడు అని పేరు గాంచిన పద్మశ్రీ రామారావుగారు ఈ విధ మైన భేదాన్ని చూపటం వారి అభిమానులమైన మమ్మెంతో కృంగదీయుచున్నది. ఇటువంటి భేద భావాన్ని ఇకముందు వారు కల్గించకుందురు గాక! మన విలేఖరి శ్రీనివాస్‌గారు కూడా ముందు ముందు ఇటువంటి భేదాభిప్రాయములతో కూడిన వ్యాసములు వ్రాయకుందురని తలంచుచున్నాను.

పి. సిద్ధికాటన్ (పినపాక.)

( 63 వ పేజీ చూడండి)

తెలంగాణా సమస్య మీద ఇప్పటికే చాలా ఉత్తరాలు వచ్చాయి. వీలుని బట్టి వాటిని ప్రచురించటానికి ప్రయత్నిస్తున్నాము. ఇక ఈ సమ స్యకి సంబంధించిన ఉత్తరాలు రాసి పంపటం ఆపమని పాఠకులను కోరు తున్నాము. ఉద్యమం సందర్భంలో జరిగిన అత్యాచారాలను గురించి కొం దరు వివరాలు పంపుతున్నారు; వాటికి సంబంధించిన ఆధారాలు సరయినవి చూడకుండా ప్రచురించ లేమని పాఠకులు గమనించగలరు.

—సంపాదకుడు.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 5—9—'69
శ్రీ సౌమ్యనామ సం॥ శ్రావణ మాసం బ. నవమి
సంపుటము : 61 సంచిక : 54

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'మామకుతగ్గ కోడలు'లో విజయనిర్మల.

వెనుక అట్టమీది బొమ్మ : పాడుకాపట్టాభి షేకం - చిత్రకారుడు : శ్రీ గనిశెట్టి

ఈ రాష్ట్రపతి ఎన్నికలో తొమ్మిది లక్షల వోట్లు పయిగా వచ్చాయి. కాంగ్రెసు పార్టీ తరఫున నిలబడిన అభ్యర్థికన్నా అదే పార్టీ ప్రధాన మంత్రి ప్రోత్సాహంతో నిలబడిన అభ్యర్థికి సుమారు 15000 వోట్లు మాత్రమే అధికంగా వచ్చాయి.

'ఆంధ్రప్రదేశ్' రాష్ట్రంలో కాంగ్రెసుపార్టీకి సుమారు 25000. వోట్లు ఉన్నాయి. రాష్ట్రపతి ఎన్నికలో కాంగ్రెసు పార్టీ అభ్యర్థికి వీటిలో 14,750 మాత్రమే మొదటి లెక్కింపులో వచ్చాయి.

కొంతకాలం కింద 'ఆంధ్రప్రదేశ్' ముఖ్యమంత్రి రాజీనామా ఇచ్చినప్పుడు ఆంధ్రప్రాంతానికి చెందినవారిని తమ రాజీనామా ఉపసంహరించుకోవలసిందిగా ఆంధ్రప్రాంతం శాసన సభ్యులలో అధిక సంఖ్యాకులేకాక తెలంగాణా కాంగ్రెసు శాసన సభ్యులలో 65 శాతంవారు కూడా కోరారు. అయితే రాష్ట్రపతి ఎన్నికలో మాత్రం ఆంధ్రప్రాంతానికి చెందిన అభ్యర్థికి మొత్తం వోట్లలో సగం కూడా మొదటి లెక్కింపులో రాలేదు. (ఈ కాంగ్రెసు అభ్యర్థి 'ఆంధ్ర ప్రదేశ్' ముఖ్యమంత్రిగా ఉన్నంతకాలం ప్రాంతీయోద్యమాలు అదుపులో ఉండటం గమనించతగ్గ విషయం.) ఈ తారతమ్యానికి కారణం ఏమయివుంటుందో ఊహించటం అంత కష్టంకాదు. కాని వాటికి కారకులయినవారు గమనించవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. సమైక్యతకి వెలకట్టటం, ప్రజాదరణని పెచ్చుగా పొందగలిగిన ఉద్యమాలని అశ్రద్ధచెయ్యటం ప్రజాస్వామ్యాభివృద్ధికి తోడ్పడవు. 'ఆంధ్ర ప్రదేశ్'లో జరిగేదే యావద్భారత దేశపు రాజకీయాలలోనూ కొంచెం పెద్దపెట్టున జరగటం ఈ రాష్ట్రానికి గర్వకారణం కాజాలదు.

'ఆంధ్రప్రదేశ్' సమైక్యత పేర పనిచేస్తున్న తెలంగాణా కాంగ్రెసు నాయకులు తమ కృషి ఏవిధంగా ఫలించగలదని ఆలోచించి చూడటం అవసరం. దేశ సమైక్యత రాష్ట్రాలలోని సమైక్యత పయినే ఆధారపడి ఉంటుంది. ప్రజాస్వామ్యాభివృద్ధి విషయమూ అంతే.

* * *

ఇది రాయటానికి కొంచెంముందు ప్రధానమంత్రి కొందరు తెలంగాణా నాయకుల సతీమణులతో తెలంగాణా ఉద్యమం రూపం మారేదాకా దానిని గురించి చర్చించటం వీలుకాదని చెప్పినట్లు పత్రికలలో వార్త వెలువడింది. కాంగ్రెసుపార్టీ అధ్యక్షులు, మరికొందరు కాంగ్రెసు నాయకులూ కూడా ప్రత్యేక తెలంగాణా ఏర్పాటుపట్ల తమ విముఖత ఇంతకిముందే ప్రకటించారు. ఈ సంచికలోనే మరొకచోట పడిన ఒక వార్త ప్రకారం బొంబాయి, మదరాసు, కలకత్తా, ఢిల్లీ మహా నగరాలలో అధిక సంఖ్యాకులు ప్రత్యేక తెలంగాణా ఏర్పాటుని ఆమోదించనట్లు తెలుస్తుంది. అంటే, ప్రధానమంత్రి నుంచి మామూలు జనందాకా ఎందరో ఇతర ప్రాంతాలవారు తెలంగాణా ఉద్యమంపట్ల అంతగా ఆమోదాన్ని ప్రకటించాల లేదని ఊహించవచ్చునన్నమాట. అటువంటప్పుడు రాష్ట్రపతి ఎన్నికలో కాంగ్రెసుపార్టీ అభ్యర్థి వోటమి తెలంగాణా ఉద్యమానికి ఏవిధంగా తోడ్పడుతుందోతెలుసుకోవటం కష్టం. ఉత్తర ప్రదేశ్‌కి చెంది, హిందీ మాతృభాషగా కల ఈ పత్రిక విలేఖరి శ్రీ శ్రీ కృష్ణ ఈ సంచికలోనే చెప్పినట్లు రాష్ట్రపతిఎన్నికలో తెలుగు కాంగ్రెసువారి బలహీనతలు బాగా బయటపడిపోయాయి. ఫజిల్ అలీ కమిషన్ సభ్యులు ఉత్తర ప్రదేశ్‌ని విభజించవలసిందని అన్నప్పటికీ ఈ దేశానికి ముగ్గురు ప్రధాన మంత్రులని ప్రసాదించిన రాష్ట్రం చీలిపోకపోవటం గమనించతగ్గది.

తెలంగాణా ప్రాంతంలో అధిక సంఖ్యాకులు విడిపోవాలని కోరుకున్నప్పుడు ప్రత్యేక తెలంగాణా ఏర్పడి తీరుతుంది. ఇంతలో వర్గ రాజకీయాలవల్ల తెలుగు కాంగ్రెసులో ఏర్పడిన చీలికలు తెలుగు ప్రాంతంలోనే కాక భారతదేశం మొత్తంమీద ప్రజాస్వామ్య వ్యవస్థకి ప్రమాద కారణాలు అయిపోయాయి. ఈ ప్రమాదం తగ్గాలంటే ప్రస్తుతం అధికారంలో ఉన్నవారు తెలంగాణా ఉద్యమంబలాన్ని గుర్తించి శాంతియుతమయిన పరిష్కారం కోసం వెతకటం మంచిది. సుమారు పదమూడు సంవత్సరాల పూర్వం జవహర్ లాల్ నెహ్రూ బొంబాయి రాష్ట్రాన్ని చీల్చటం ఎన్నటికీ జరిగే పనికాదనటం ఎందరికో గుర్తు ఉండే ఉండవచ్చు.


మాలోనూ విభేదాలుండేవి కాని మేము విడిపోలేదు....
"మనం అతి త్వరలో ప్రభుత్వం వైపు కూర్చుంటామనుకుంటాను!
నేనే కనక అప్పుడు ఆ పని చెయ్యక పోతే ఇంత పని జరిగి ఉండేది కాదు......
కోడి పిల్లలన్నీ నాకే దక్కుతాయి!
ఇందిరా గాంధీ ప్రజాస్వామ్యం

శ్రీకృష్ణ

# రాష్ట్రపతి ఎన్నికలో తెలుగువారి పాత్ర

ఈవారం న్యూఢిల్లీలో చరిత్ర కొత్త మలుపు తిరిగింది. సిలోన్‌లో ఒక ప్రధాన మంత్రిణి పెద్ద ఇక్కట్లు తెచ్చిపెట్టటం చూశాము. ఇక్కడా అదే జరుగుతున్నదనుకుంటున్నారు.

ప్రధానమంత్రి ప్రతిదినం కమ్యూనిస్టు వర్గాలు ఏర్పరచిన సమావేశాలలో వర్గ వైరుధ్యాలని రేకెత్తించేట్లు ప్రసంగిస్తున్నారు. ఈ దేశంలో కాంగ్రెసు మంత్రులు, మత సంస్థల అధిపతులు, ధనవంతులు. మేడమ్ గాంధిగారు బీదవారితో వారిమీద ద్వేషాన్ని పెంచుకోమని చెప్తున్నారు. మేడమ్ గాంధి ఈ మధ్య కమ్యూనిస్టు నాయకులు బాబూ భూపేష్ గుప్త, క్రిప్టో కమ్యూనిస్టు కృష్ణమీనన్‌లతో మంతనాలు జరుపుతున్నారన్న సంగతి అందరికీ తెలుసు. పార్లమెంటులో మేడమ్ గాంధిపక్షం వహించేది బాబూ భూపేష్‌గుప్త కాని ఆమెవల్ల మేలు పొందిన వారెవరు కారు. ఇది విచిత్రంగా ఉంది......

## ఉత్తరప్రదేశ్ విశిష్టత

చరిత్రలో జరిగినదే జరుగుతుంది అంటారు. 1947 లో భారతదేశం విడిపోవటానికి కారణం ఉత్తరప్రదేశ్. దేశం ముక్కలయింది సరే; తిరిగి 1969 లో ఉత్తరప్రదేష్ రాష్ట్రమ్ కాంగ్రెసు విభజనకి పునాది వేసింది. మేడమ్ ఇందిరాగాంధిగారు ప్రధానమంత్రి అయినప్పటినుంచీ తమ కీలుబొమ్మనే రాష్ట్రపతి పదవిలో ఉంచటానికి ప్రయత్నిస్తూ వచ్చారన్నది నిర్వివాదాంశం. లౌకిక సిద్ధాంతం అంటూ డా. జాకిర్ హుస్సేయిన్‌ని రాష్ట్రపతి చేశారు. వారు మరణించిన తర్వాత మేడమ్ గాంధి ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ప్రధానమంత్రి, రాష్ట్రపతి కలిసి పని చెయ్యాలి కాబట్టి తమకి నచ్చిన వారినే ఎన్నుకోవాలని అన్నారు. అయితే ప్రధానమంత్రి ఉద్యోగం 1972 దాకానే కాని రాష్ట్రపతి ఉద్యోగం 1974 దాకా కాబట్టి ఈ సిద్ధాంతం ఎక్కువకాలం నిలువలేదు. వారు వెంటనే తమ స్వరం మార్చుకున్నారు. మహాత్మా గాంధి నామస్మరణంచేసి శత జయంత్యుత్సవ సంవత్సరంలో బాబూ జగజీవన్‌రామ్‌వంటి హరిజనుడిని ఎన్నుకోవాలన్నారు. వారి ఈ సిద్ధాంతాన్ని పార్లమెంటరీబోర్డువారు ఆమోదించలేదు. మేడమ్ గాంధిగారు తాము పగ సాధిస్తామని శపథం చేశారు. బెంగుళూరునుంచి ఢిల్లీకి రాగానే శ్రీ గిరిని సందర్శించుకున్నారు. శ్రీ గిరి తాము ఏమయినా ఉపసంహరించపోయేదిలేదని అన్నారు. శ్రీ గిరి చేసుకున్న ఈ నిర్ణయాన్ని బలపరచిన వారిలో ప్రథములు శ్రీమతి గాంధి, శ్రీమతి గిరి.

## తెలుగుదేశంలో కాంగ్రెసు స్థితి

భారతదేశ చరిత్రలో అతి విషాదపూరితమయిన ఘట్టం ఇది— శ్రీ వి. వి. గిరి ఆంధ్రదేశంవారు, వారు కాంగ్రెసు నాశనానికి తోడ్పడ్డారు., మరొక ఆంధ్రులయిన శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు వీరి పక్షమే వహించారు. శ్రీ బ్రహ్మానందరెడ్డిగారిని కాంగ్రెసు అధిష్ఠానవర్గంవారు మరొక రెడ్డిగారి నుంచి రక్షించారు. వారు తమ కృతజ్ఞతని ఈవిధంగా చూపించుకున్నారు. 'ఆంధ్రప్రదేష్' నాశనం చెయ్యటానికి రెడ్లలో అంతఃకలహాలు



భారత రాష్ట్రపతిగా ఎన్నికైన శ్రీ వరాహగిరి వెంకటగిరి.

కారణం అయ్యాయి. ఈ కలహాలే కాంగ్రెసుని కూడా నాశనం చేస్తున్నాయి.

## కాశ్మీరి, ఉత్తరప్రదేశీ, తెలుగువాడు

ఇది విషాదపూరితమయిన ఘట్టం అన్నాను. ప్రధాన మంత్రి కాశ్మీరీ., కాశ్మీరీలంతా వారిపక్షం వహించారు. ప్రధానమంత్రి రాష్ట్రం ఉత్తరప్రదేష్., ఉత్తరప్రదేష్‌వారు అధికంగా వారు చెప్పినట్లే నడుచుకున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసుకి 196 వోట్లు ఉన్నాయి. శ్రీ సంజీవరెడ్డికి 118 వోట్లు వచ్చాయి. శ్రీ గిరికి 131 వచ్చాయి. (ఎందరో సభ్యులు వోట్లు వెయ్యలేదు.) అంటే శ్రీ గిరికి కాంగ్రెసు వోట్లు ఎన్నో వచ్చాయన్న మాట.

జమ్మూ, కాశ్మీర్‌లలో కాంగ్రెసుకి 61 వోట్లు ఉన్నాయి. వీటిలో 58 శ్రీ గిరికి వచ్చాయి.

ఉత్తరప్రదేష్‌లో 216 కాంగ్రెసు వోట్లు ఉంటే శ్రీ రెడ్డికి 133, శ్రీ గిరికి 181 వోట్లు వచ్చాయి.

**దీనిఅర్థం.? కాశ్మీర్ కాంగ్రెసు వారు కాంగ్రెసు వారివైపూ, ఉత్తరప్రదేష్ కాంగ్రెసు వారు ఉత్తరప్రదేష్ కాంగ్రెసు వారివైపూ నిలబడ్డారు కాని ఆంధ్రప్రదేష్ కాంగ్రెసువారు ఆంధ్రప్రదేష్ కాంగ్రెసు అభ్యర్థికి ఎదురుగా పనిచేశారు.**

## హుస్సేయిన్ — అంతరాత్మ

కాంగ్రెసు కార్యాచరణ సంఘం వారినీ, ప్రధాన మంత్రిగారు చెయ్యదలుచుకున్న దాడి రెండు రకాలు అని ఇంతకి ముందే అన్నాను. కాంగ్రెసు కార్యాచరణ సంఘం తమని ఉద్యోగంలోనుంచి తీసి వెయ్యటానికి ప్రయత్నించిందని మేడమ్ గాంధి అన్నారు. ఇది తర్వాత కలిగిన ఆలోచన అనిపిస్తుంది. ఎందుచేతనంటే, బెంగుళూరులో ఆమె చేసిన ఆరోపణ మరొక విధంగా ఉంది. ప్రధాన మంత్రిగా తమ అధికారానికి అడ్డువచ్చే రాష్ట్రపతిని తీసుకురావటానికి ప్రయత్నం జరిగిందని ఆమె అప్పుడు అన్నారు. డాక్టరు హుస్సేయిన్ ఎన్నికలో 'అంతరాత్మ' ప్రకారం వోటు వెయ్యమని మేడమ్‌గాంధి కోరలేదు డా. హుస్సేయిన్

## న్యూఢిల్లీ లేఖ

అభ్యర్థిత్వానికి ఆమె ప్రధాన కారకులు కాబట్టి. శ్రీ సంజీవరెడ్డిగారి విషయంలో మాత్రం 'అంత రాత్మ' ప్రసక్తి తీసుకువచ్చి కాంగ్రెసు అభ్యర్థికి అపజయాన్ని సాధించారు.

### అపవిత్ర సంబంధం...

కాంగ్రెసు సిండికేట్ జనసంఘం, స్వతంత్ర పార్టీలతో అపవిత్రమయిన సంబంధాన్ని ఏర్పరుచు కుందని వారు అన్నారు. కాని ఎవరినయితే కమ్యూనిస్టులు తమ అభ్యర్థి అన్నారో ఆ వ్యక్తినే తాము బలపరచే ఏర్పాట్లు ఆ కమ్యూనిస్టులతోనే చేసుకున్నారు.

ఇంకొక విధంగా చెప్పాలంటే మేడమ్ గాంధిగారి ఆదేశం ప్రకారం కాంగ్రెసువారు కమ్యూనిస్టుల అభ్యర్థికి ఓట్లు వేశారు.

సిండికేట్ నాయకులు తమ అభ్యర్థి విజయం కోసం చేసిన ప్రయత్నాలు పార్టీలో ఐక్యమత్యానికే దెబ్బ తీశాయి. ఇక మేడమ్ గాంధిగారి కార్య నిర్వహణ వారి అనుచరులు అనుకున్నంత తేలికగా ఉండబోదు. పార్టీ అభ్యర్థి శ్రీ సంజీవరెడ్డి ఓటమి పార్టీ నాయకురాలయిన తమకే అవమానం అని కొందరు కాంగ్రెసు వారు అనకమానరు. దేశంలో స్థిమితం కాంగ్రెసు పార్టీవల్ల మాత్రమే నిలువ గలదని ఎప్పోసార్లు అన్నాను. మేడమ్ గాంధిగారి ఉపాయాలు ఈ స్థిమితానికి ప్రమాదం తెచ్చి పెట్టాయి. మొరార్జీదేశాయి మీద వారు నడిపిన ప్రచ్ఛన్న యుద్ధం, 'యువ తులుష్కుల'కి వారు ఇచ్చిన ప్రోత్సాహం కాంగ్రెసు పార్టీలోని క్రమ శిక్షణని దెబ్బతీశాయి. సిండికేట్‌కి ఎదురుగా వారు లేవదీసిన విప్లవం క్రమశిక్షణని నాశనం చేసింది. ముందు ముందు వారి పార్టీ 'విప్'ని ఎవర్ని శిరసావహిస్తారో చూడాలి.

### చవాన్‌కి బర్తరఫ్...

ఒకటి మాత్రం జరిగి తీరుతుంది. నెలాఖరు లోగా వారు తమ మంత్రివర్గాన్ని పునర్నిర్మి స్తారు. శ్రీయుతులు చవాన్, పునేచా, వి. కె. ఆర్. వి. రావు, జయసుఖలాల్ హాతీ, కె. సి. పంత్ మొదలయిన వారిని ఉద్యోగంలో నుంచి తీసివెయ్య టానికి పూనుకున్నట్లు వార్తలు వస్తున్నాయి. వీరందరూ శ్రీ సంజీవరెడ్డినే బలపరిచారు.

శ్రీ కృష్ణమీనన్ తిరిగి వస్తారు. వారు కాంగ్రెసులో లేదా మేడమ్ గాంధిగారి కాంగ్రెసులో చేరవచ్చు. లాలా గుల్జారీలాల్ నందా తిరిగి మంత్రి వర్గంలో చేరవచ్చు. మేడమ్ గాంధి ద్రావిడ మున్నేట్రకజగంతో స్నేహంగా ఉన్నారు కాబట్టి తిరిగి మంత్రికావచ్చు. వారుకూడా లాలాజీవలె తమ అర్హతని నిరూపించుకున్నారు. ●

# తెలంగాణా తెలుసుకోండి

ఒకజాతిపై గాని, రంగుపై గాని, ప్రాంతంపై గాని విద్వేషాలు కలిగాయుంటే అవి సమసిపోవుటకు చాల కాలం పడుతుంది. ఈ విద్వేషాలు పుట్టనీయకుండానే చూడాలి గాని పుట్టిన తరువాత విచారిస్తే లాభం ఉండదు. అమెరికాలో నీగ్రోలను తెలంగాణాలో ఆంధ్రుల పరిస్థితికి పోల్చవచ్చు. నీగ్రోల కొరకై ఎన్ని రక్షణలు ఇచ్చినా, రాజ్యాంగాన్ని సవరించినా వాని అమలులో ప్రజల సహకారం లేనిది ఎందుకూ పనికిరావు. ప్రాంతీయ అభిమానం ప్రతి ఒక్కరికీ ఉంటుంది. అసలు ఆ అభిమానం లేకపోవడం కూడా ప్రమాదమే. కాని ఏ అభిమానమైనా మించి పోయి దురభిమానంగా మారితే పరిస్థితులు మన చేతుల్లో దాగవు. అలాగే తెలంగాణాలో ప్రాంతీయ దురభిమానం పెచ్చు పెరిగి పోయిందనే చెప్పాలి. పరిస్థితుల నవగాహన చేసికోలేని కొన్ని ఆవేశపూర్వక శక్తులు, ఉపన్యాసాలు, ఊరేగింపులు, దహనాలు, బాంబు విసర్లకు ఉద్యుక్తులయ్యారు. ఒకలనల్లైన తెలంగాణీయునిగా పరిస్థితులను, సరిగామాలను ప్రత్యక్షంగా పరిశీలించి చూసినతర్వాత నా కిలా ప్రా[illegible]నిపించింది.

ఉద్యమం మొదట్లో విద్యార్థులు నడిపారని లోక విదితమే. వీధుల కెక్కిన విద్యార్థుల నినాదాలు, దానికి సామూహిక ప్రజానీకం మద్దతు ఎంత ఉందో గమనించండి. ఏ ఒక్క శాసనసభ్యుడు గాని, మరి ఏ ఇతర రాజకీయనాయకుడు గాని ఇందులో [illegible]. [illegible] బాగా [illegible]. ఇప్పుడు లాగినా తెగదు [illegible] పరిశీలించే కొందరు స్వార్థపరులు [illegible] ఉంచలు వేశారు. [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. గిరిని మొదట లాగిన పెద్దలు శాసనసభ్యులు, మాజీ తెలంగాణా ప్రాంతీయ సంఘ అధ్యక్షులు, హౌసింగ్ బోర్డు సభ్యులు అయిన శ్రీ కె. అచ్యుతరెడ్డిగారు. ఆయన ఒక ప్రకటన చేస్తూ ఈ ఉద్యమం ప్రజల్లో బాగా వ్యాపించి పోయినటువంటిదనీ, వీరి కోర్కెలను ప్రభుత్వం వెంటనే తీర్చి ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు చేయాలని కోరారు. ఆతరువాత వారి ప్రకటనలు ఒకటి తర్వాత ఒకటి విరివిగా అచ్చు దొర్లాయి. అందులో ఆయన గారు అన్యాయాలు అక్రమాలు అంటూ వేలెట్టి చూపుతూ ఎన్నో ప్రకటనలు, చేశారు. (వీరు ప్రస్తుత అధికార నాయకులకు వ్యతిపక్షమనీ, ప్రస్తుతము నిరుద్యోగ సమస్య తీరడానికి ప్రయత్నిస్తున్నారనీ అందరికీ తెలిసియే యుంటుంది.) నాలుగు సంవత్సరాలు ప్రాంతీయ సంఘం ఛైర్మన్‌గా పని చేసినప్పుడు ఆయన గారికి ఈ అన్యాయాలు, అక్రమాలు స్ఫురించలేదా! ప్రస్తుతం పేరేమీ వ్యాపకంలేని కొంతమంది పెద్దలకు ఇది మంచి కాలక్షేపంగా మారిపోయింది. పేరు తెచ్చుకోవాలన్నా, పెద్ద వారనిపించుకోవాలన్నా దేశంలో మరి ఇలాంటి ఉద్యమాలు జరగాలి. లేకపోతే తెలుగు లోకం కొంతమంది క్రొత్త పేర్లు వింటూ ఉండుంటే ఇలాంటి ఉద్యమాలు కావా! మరికొంతకాలం గడిచిన తరువాత శ్రీ కొండా వెంకటరంగారెడ్డి గారు (మాజీ ఉపముఖ్యమంత్రి) ఒక ప్రకటన చేశారు. అందులో ప్రత్యేకత అంటూ లేదు. ఎందుకంటే అందులో ఆయన వేరు తెలంగాణా సమర్థించలేదు. శ్రీ బద్రి [illegible] గారిని సమర్థిస్తూ కొన్ని [illegible] [illegible]. [illegible] సదవగాహన చేసుకొని పరిస్థితులను అర్థంచేసు కోవాలని అందులో ఉంది. మరేమో ఏదో ఇంద్రజాలం వేసి నట్టు మరి రెండు రోజులకు ఆయనగారు వేరుతెలంగాణా, అక్రమాలు, అన్యాయాలు ముఖ్యమంత్రి రాజీనామా అంటూ గట్టిగా కేకలు వేశారు. తెలుగు కురువృద్ధులైన శ్రీరెడ్డి గారు అన్ని నీతులు చెప్పి అంతలో అలా మారి పోతారని ఎవరూ అనుకోలేదు. కుర్రవాడు ఇవి చెప్పిస్తుంటే ఇవి రాజకీయాలురా బాబూ అవి అలానే ఉంటాయి అన్నారు పెద్దలు. ఈ ఉద్యమం బాగా వ్యాపించుకుపోతూ ఉంది. అలా వ్యాపిస్తున్న అగ్నిజ్వాలలు నగరం దాటి జిల్లాలు, తాలూకాలు, గ్రామాలను సహితం అలుముకొన్నాయి. ఈ ఆకస్మికమైన మంటల సొగలకు కొంతమంది కళ్ళు మూసుకొన్నారు. మరి కొంతమంది పరుగులు తీశారు, ఇలా జరుగుతున్నా చాల గుప్తంగా, మౌనంగా ఉన్నారు శ్రీ చెన్నారెడ్డిగారు. ఉద్యమం ప్రారంభించిన నాలుగు నెలలకు రంగంలో కురికారు వీరు.

ఇలా సాగుతున్న ఉద్యమంలోకి శ్రీమతి సదాలక్ష్మి గారు ప్రవేశించారు. వీరి ప్రవేశం మహిళాలోకాన్ని రచ్చలోకి లాగింది. అసలుకు హైదరాబాదు మహిళలు పరదాదాటి బయటికిరారు అంటారు. ఆ నిజానిజాలు దేవుడెరుగుగాని, వీరు బరితెగించి, స్త్రీ యొక్క సౌకుమార్యాన్ని పూర్తిగా మరచిపోయి వీధులలో బూతుమాటల నినాదాలతో (ఆంధ్రస్త్రీలపై) బయలుదేరారు. సత్యాగ్రహం, ధర్నా చేసేవారు [illegible], చూడడానికి వచ్చిన జన సమూహం [illegible]. వీరి నాయకురాలైన శ్రీమతి [illegible] [illegible] [illegible]. వీరు ప్రతి మీటింగులోను ఆంధ్రులను [illegible] తిడుతూ ఉపన్యసించారు వీరు ఆంధ్రప్రదేశ్ దగ్గాదారు, [illegible]మంత్రిగా [illegible] చేశారని ప్రజలకు తెలుసును. ఒకసారి శ్రీమతి గారు తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరుని సన్నిధిన దేవాలయ అధికారులు రెండు వేల రూపాయల సరలను బహూకరించగా వాటిని స్వీకరిస్తూ నేను 'ఆంధ్రప్రదేశ్ ఆడపడుచు' అని వక్కాణించడం లోకులకు విదితమే. ఆ ఆడపడుచుకేనా ఇపుడు ఇలాంటి బుద్ధి పుట్టిందని అనుకుంటాము.

మన దేశస్థులకు ఒక వింత జాడ్యముంది. ఒకరిని బాగు పడనీయము, మనము బాగుపడము. ఒకరిని విమర్శించడం, ఆత్మ పరీక్ష చేసుకోక పోవడం— ఇదే మన దేశ రాజకీయ ప్రతిపక్షాలలో గల దురలవాటు. అధికార పక్షం చెప్పిన, చేసిన దానికి వ్యతిరేకత తెలపడమే ప్రతిపక్షాల మొట్టమొదటి హక్కులా అనుకుంటారు. ఇది సమసిపోయినపుడే మన జాతి తెలుగు బాటలోనికి వస్తుంది. ప్రతిపక్ష సభ్యురాలు శ్రీమతి ఈశ్వరీబాయిగారు ఈ ఉద్యమంలోకి ఉరకడం సువిదితమే. కొన్ని ప్రతిపక్షాలు విడిపోవడం సమర్థించక పోయినా రాష్ట్రపతి పరిపాలన, ముంత్రి






# మేతలు అధిక పాలవృద్ధికి, అధిక గ్రుడ్లకు

NSF పశువులమేతలు పాడి ఆవుల పాలవృద్ధిని అత్యధికము చేయును.
NSF కోళ్లమేతలు గ్రుడ్లను, మాంసమును అధికపరిచి మీకు
గంపెడు లాభాలను చేకూర్చును.

## పుష్టి, వృద్ధి, శ్రేష్ఠము

NSF మేతలు విటమిన్లు నిండిన సమగ్ర, సంగ్రహ ఆహారము. మీ పశువులకు, కోళ్లకు కావలసిన పుష్టినిచ్చును.
ఈ NSF మేతలు కఠినతర నిర్ణయమునకు, కఠిన పరీక్షలకు లోనైనవి.

## సులభము, తేలిక, సునాయాసము

NSF మేతలు మీరు సులభముగా భద్రపరచి వాడుకోవచ్చును.
మీ పశువులు, కోళ్లు వీటిని ప్రీతితో భుజించి అతి సులభముగా జీర్ణించుకోగలవు.
NSF పశువులమేతలు 10, 25, 50 కిలోగ్రాముల సంచులలో గుండ లేక అణువుల రూపమున దొరకును.
NSF కోళ్ల మేతలు 10, 25, 50 కిలోగ్రాముల సంచులలో గుండ రూపమున దొరకును.



అంతంకానటువంటి దృష్టితో. గూళ్ళ వైపు పరుగెడుతున్న పిట్టలధ్వని విని సంధ్య చీకట్లు కాంతిలో చీకటి మయమై పోతున్న నగరంవైపు (ప్రకాశంగా వెలిగే నగర వీధులలోని విద్యుద్దీపాలు (బద్దలవడంమూలాన) స్నేహితుని సలహా ననుసరించి బస్సులు లేవనీ బాధగా రిక్షాలో ఎక్కి గమ్యస్థానం పేరు చెప్పి పొమ్మన్నా, కాలక్షేపం కోసం వాడితో మాట్లాడవలసి వచ్చింది.

ఏమయ్యా! ఏడుంటావు నీవు?

గౌలిగూడా దొరా! నిన్న మొన్న జరిగింది రామరావణ యుద్ధం ఆడనే. పోలీసోళ్ళు మొన్న తన్నిన్రు దొరా. మూడుదినాలనుంచీ పెద్దాసుపత్రిలో ఉన్నా. ఇంక మంచిగ కాలేదు. అన్నాడు అక్కడక్కడా తగిలిన గాయాలు చూపుతూ.

అళ్లెందుకు కొట్టిన్రు. నీవు గిట్ల రాల్లేసినావా? అన్నా.

అళ్ళనితో లాభమేముంది దొరా. బస్సులో పోరగాళ్ళ బహాత్ చాలా అయిపోయిన్రు. అళ్ళమీదకి రాల్లేసి ఉరుకుతున్రు. ఆల్లొచ్చిమమ్ముల తన్నిన్రు. ఇయ్యాల రేపు దునియాలో శాంతిలేదు దొరా. ఈ నెహ్రూసాబ్‌తోనే పోయింది అంతా. తెలంగోల్ల ఇధాయి వదుతుంద్రు సార్. ఈ పోరగాళ్ళకు ఏమి రోగ మొచ్చిందో గాని సవారే లేకుందొరా. మొన్న కర్ఫ్యూ నాడు రెండుదినాలు పస్తున్నా దొరా! ఈ డాక్టర కఱుర్లు

# తెలంగాణా...

లీడర్లు ప్రతిదిన్నం వచ్చి పోరగాళ్లకు ఏదో సెప్తున్నరు. ఈళ్ళు పోలీసోళ్లను గోల్‌మాల్ సెత్తుంద్రు. వాళ్ళు తంతుంద్రు. దునియా మారిపోయింది దొరా. అంటూ ఇంటిముందు ఆపాడు రిక్షాని.

ఒకరోజు ఒక విద్యార్థి బృందం మా ఇంటికి వచ్చింది. అందరూ తెలిసిన వారే. ఏరా! మరి కాలేజీలు, స్కూళ్ళు అక్కరలేదా? అన్నా నేను. పోతే తంతున్రు గద. మరెట్ల పోవాలసార్ అన్నారు. అది నిజమే. విద్యాసక్తిగల వేలాది విద్యార్థులను ప్రతి పాఠశాల, కళాశాలలో చేతికి నిండని అల్లరిగుంపులు అల్లరి పెట్టుతుంటే దిక్కెవరు? తల్లిదండ్రులేమి చేస్తారు?

ఆళ్ళింట్లోన్న ఆంధ్రోళ్ళను ఎళ్ళగొట్టిండ్రు సార్ అన్నాడొక విద్యార్థి.

ఆసక్తిగా ఏమిటి? ఎలా! అన్నాను.

గదేసార్! రాత్రేళ ఆయన స్కూటర్‌గిట్ల తగలెట్టిండ్రు. పొద్దుగాల ఇరానీ హోటలు నించి రాత్రి లోపల ఎళ్ళకపోతే నిన్ను తగలెడ్తాం. అని ఫోన్ చేసిన్రు. మధ్యాన్నంకాడికే ఆయన పెళ్ళాం బిడ్డలను టాక్సీలో బెజవాడ ఇస్సొక్కచ్చిండు.

అని గలగల నవ్వాడు చేసిన ఘనకార్యానికి.

వాళ్ళేమి చేశార్రా! వాళ్ళ నెందుకు ఇబ్బంది పెట్టారు. అన్నాను. మరి అందరూ గిట్నానే సేసిన్రు గదసార్. అన్నాడు.

ఇలాంటి అల్లరిమూకలు ఉన్నా అంతా ప్రేతే వనే. ఒకరిని చూసి మరొకరు. నే కలిసిన చాలామంది విద్యార్థులు మానసికంగా బాగా దెబ్బ తిన్నారు. ఆర్థికంగా దెబ్బతిన్న కుటుంబాల బాధలు, వారి పిల్లల గురించి వారి ఆవేదన చెప్పనలవికాదు. లేపోవాపో చదువు చెప్పిపెట్టి సంసారానికి ఆదుకుంటారేమోనని వేచియున్న వేలాది తల్లిదండ్రులు ఈ పరిస్థితుల ధాటికి ఆగలేక తమ భవిష్యత్తు తెలుసుకొని బాధపడుతున్నారు. పోస్టు గ్రాడ్యుయేటు ఫైనలియర్ విద్యార్థుల అగచాట్లు ఆ దేవుడికెరుక. ఒక సంవత్సరం పూర్తిగా అయిపోయింది. మరో సంవత్సరం ప్రారంభమయింది. కనీసం ఈ సంవత్సరమైనా విద్యా సౌకర్యాలు ఉంటాయో లేదో అనే బెంగ. ఇది ఇలా ఉండగా రెండువర్గాల విద్యార్థులు విశ్వవిద్యాలయ వైస్‌చాన్సలర్ ఇంటిముందు ధర్నా చేశారు. అందులో కళాశాలలు తెరవమని అనే వర్గం వారి ఒకానొక హృదయం కదిలించే విన్నప మేమంటే అయ్యా! ఆ అమెరికన్ ప్రొఫెసర్లు విద్యార్థులను గగన విహారులను చేసి చంద్రలోకానికి పంపుతుంటే మీరు (ప్రొఫెసర్లు, ఉపాధ్యాయులు) మమ్ములను రాజకీయ ఉన్మాదులను చేసి వీధులలోకి గెంటుతున్నారు అని.

కార్మికులు, విద్యార్థులు రెచ్చగొట్టబడి ఈ ఉద్యమంలో చేరారు. కూలీనాలీ జనం, కర్షకుల హృదయాలలో విషబీజాలు నాటి ఉద్యమానికి ఉద్యుక్తులను చేశారు. అన్నీ తెలిసిన ప్రజలు భయాందోళనలతో భావ ప్రకటన చేయడానికి వీలు లేకుండా ఉన్నారు. మరి ప్రత్యేక తెలంగాణా ఎవరికి? కొన్ని అరాచక శక్తుల దుష్ప్రచారానికి ఒక జాతి సంస్కృతి బలి కావాలా? ఒక వర్గం వారి దురాలోచనకు వేలాది అమాయకులు హింసా కాండలకు లోను కావాలా? అల్లరి మూకల చిల్లర చేష్టలకు విశ్వవిద్యాలయాలు మూయబడాలా? జాతి విద్వేషక శక్తులను ప్రజాస్వామ్యమనే పేరున వదలి వేయాలా?

తరతరాల నుండి ఐక్యతకు దూరమై, స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాతనైనా మహానుభావుల త్యాగాలతో నిస్వార్థులు, నిరాడంబరులు, సంఘోద్ధారకులు అయిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, శ్రీ పొట్టి శ్రీరాములు, శ్రీ సురవరం, శ్రీ బూర్గుల, శ్రీ జొన్నవిత్తుల గురునాథం, శ్రీ న్యాపతి సుబ్బారావు, శ్రీ మోచర్ల సీతారామయ్య మొదలుగాగల తెలుగు తల్లి సుపుత్రులు తెలుగుతల్లి ఐక్యతకై, తెలుగుజాతి సంస్కృతి, విశిష్టత అభివృద్ధికై కనిన కలలు నిజం చేసి రాగద్వేషాలు మాని—

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు

అని నాలుగుకోట్ల ఆంధ్రులు ముక్త కంఠముతో పాడినరోజు మన జాతికి మనం న్యాయం చేకూర్చిన వారమవుతాము.

—వై. యాదగిరి

## చిన్న పిల్లలకి కడుపులో పుళ్లు

ఆరేళ్లు కూడా నిండని చిన్న పిల్లలకి కడుపులో పుళ్ళేమిటి? కడుపులో నేకాదు పేగులు మొదలయ్యే ప్రదేశంలో కూడా



పు. ఏర్పడవచ్చు.

వీటి చిహ్నాలు మొలా ఉంటాయి? ఇవి ఎన్నోరకాలు; కాని, కొన్ని ఇలా ఉంటాయి—

1. కడుపు నొక్కినట్టుండటం కొంత నొప్పి, 2 ఆకలి తరచు మారిపోవటం, 3. పులుపుని కక్కి వెయ్యటం.

సాధారణంగా ఈ రకం పుళ్ళు కొంత మానసికంగా అస్థిమితంగా ఉండేవారికి వస్తూ ఉంటాయి. ఇటువంటివారిపట్ల జాగ్రత్తగా నడుచుకోవాలి. వారిని తరచు కోప్పడరాదు, అశ్రద్ధ చెయ్యరాదు.

పిల్లలు కొంత ఎదిగితే ఈ పుళ్ళని తేలికగా కనిపెట్టవచ్చు. ఆకలిగా ఉన్నప్పుడు బాధకలుగుతుంది. ఈ విషయాన్ని అశ్రద్ధ చేస్తే పిల్లలకి వాంతులు, రక్తస్రావం కలుగవచ్చు. 'తిండిపోతు!' అని తిట్టటం ఎంత హానికి దారితియ్యగలదో గ్రహించవచ్చు.

హెచ్. ఎల్. హార్డ్సన్‌సొన్
(శాపీరయ్యు)

# ప్రత్యేక సదుపాయం!

సరకు ఉన్నంత వరకే

[illegible] పైసల ఖరీదైన ప్రత్యేకమైన
క్రొత్త డిజైను ప్లాస్టిక్ గ్లాసు
10 పైసలకు మాత్రమే మీకు
ఈ డబ్బాలో లభిస్తుంది







ప్రతి డబ్బాలో ఇదివరకు ఉన్నంత బోర్న్‌విటా
(450 గ్రా. నికరం) ఉంటుంది.

**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం — కేడ్‌బరీస్ బోర్న్‌విటా!**

Bensons/2330 TL

# రౌడీపిల్ల



యజ్ఞంశెట్టి శౌరి

సీత మా మామయ్యకూతురు. నాకంటె అయిదేళ్లు పెద్దది. నాకు బాగాగుర్తుంది. చిన్నప్పుడు నేను మాణిక్యాలరావు పంతులు బడికి వెళ్లనని మారాంచేస్తుంటే, మా అమ్మ, రెండిళ్లవతల ఉన్న మామయ్య వాళ్లింటికెళ్లి సీతతోచెప్పి వచ్చేది. వెంటనే సీత చక్కావచ్చి నాచెవి మెలిపెట్టి తనతో పాటు బడికి చక్కాలాక్కుపోయేది. అంచేత అప్పట్లో అదంటే నాకు భయం, కోపం కూడా ఉండేవి. అప్పుడప్పుడు దానిమీద కోపమొచ్చి 'రౌడీ' అని తిట్టేవాడిని. అదినవ్వి ఊరుకొనేది. ఇలా అన్జెప్పి అవడం నే నొక్కడినే కాదు. మా బంధువులు, మా పేటలో కుర్రాళ్లూ అందరూ అనే వాళ్లు. ఆఖరికి అత్తయ్య కూడా సీతచేసే అల్లరి పనులకు విసిగిపోయి 'నిజమేరా చిన్నా! ఇది వట్టి రౌడీపిల్ల. నా కడుపు నెలాపుట్టిందో తెలీడంలేదు. ఛస్తున్నా ననుకో దీనితో!' అనేది.

తను అయిదోక్లాసు రెండో సంవత్సరం చదువుతూండగా జరిగిన ఓ సంఘటన నేను మరచిపోలేను. బహుశా అప్పటి నుంచే సీతకి 'రౌడీపిల్ల' అనేపేరు వచ్చిందను కొంటాను. ఆరోజు రీసెస్‌లో కొంత మంది కుర్రాళ్లు సీతవాళ్ల పెరట్లోని జామచెట్టెక్కి కాయలు కోసుకొనడం మొదలెట్టారు. సీత వీళ్లనిచూసి ఇంట్లోకెళ్లి ఓ కర్రతెచ్చి తనూ చెట్టెక్కి వాళ్లని కొట్టడం మొదలెట్టింది. ఆ ఖంగారులో ఓ కుర్రాడు చెట్టుమీదనుంచి క్రింద పడిపోయాడు. కొద్దిగా దెబ్బలు తగిలినయి. వెంటనే అతనిని హాస్పిటల్‌కి తీసుకుపోయారు. ఆ రోజునుంచీ సీతకథ మొదలయిందనుకోవచ్చు. దానితో మాట్లాడ్డానికి అందరికీ భయంగా వుండేది. దానికి మొఖమాటం, భయం ఏమీ లేవు. ఎవరిదయినా సరే ఎంత మాటయినా మాటిగా అనేసేది.

సీత హైస్కూల్లో అడుగుపెట్టినకొద్ది రోజుల్లోనే అందరిచేతా గుర్తించబడింది. మా వూళ్లో జనం చాలా చిత్రమయినవాళ్లు. ఏదయినా ఓ క్రొత్త వస్తువు కనబడితే ఎగబడి చూసేవాళ్లు. అంతటితో వదలరు. దానిని హేళనచేయడానికి ప్రయత్నిస్తారు. వాళ్లకి ఏదయినాసరే 'పాత' అంటే ఇష్టం. అలాంటి మా ఊళ్లో సీత మొదటిసారిగా పంజాబీ డ్రస్ వేసుకొని స్కూలుకెళ్లింది. నడక కూడా తలెత్తుకొని, ఠీవిగా, అచ్చం మొగపిల్లాడిలా నడిచేది. నేను ఫోర్త్‌ఫారంలో కొచ్చేసరికి సీత యస్సెల్సీ చదువుతోంది. రోజూ తనతోపాటు నన్నూ స్కూలుకి పిల్చుకు వెళ్లడం మళ్లీ మొదలయింది. హైస్కూల్లో కొచ్చింతర్వాత మొగపిల్లలు, ఆడపిల్లల్లోని ఆడతనం కోసం వెదుకుతారు. సీత చాలామంది యస్సెల్సీ కుర్రాళ్ల దృష్టి నాకర్షించింది. స్కూల్లో చాలామంది ఆడపిల్లలకంటే సీత అందంగా వుండేది. ఉన్నట్టుండి రత్నారావు అనే కుర్రాడొకతను సీతని ప్రేమించటం మొదలెట్టాడు. అతను ఓ చిన్నసైజు రవుడీ. యస్సెల్సీ అప్పటికి నాలుగోసారి చదువుతున్నాడు. రోజూ సీత వెనక తిరగడం, నవ్వడం. పోజులు కొట్టడం చేస్తున్నాడట తను. ఇలా అని చాల్రోజుల తర్వాత నాతో చెప్పింది.

'మూస్తూండు! ఎప్పుడో వాడిభరతం పడతాను' అని కూడా అంది. నాకు చాలా భయంవేసింది. వాడితో పోట్లాడ్డం అంతమంచిదికాదు. అదే సీతతో చెప్తే, 'ఊహూ! అలాగా! సిగ్గులేపోతేసరి. నీకెందుకు, వాడివని నేను చూసుకొంటానని ధైర్యం చెప్పడం పోయి నన్ను కూడా భయపెడుతున్నావా?' అంటూ సిసింద్రీలా లేచింది. సరేనన్జెప్పి నేను నోర్మూసుకూరుకుండిపోయాను. సీత చెప్పినంతా చేసింది. తను ఇంటికొచ్చేప్పుడు ఓరోజు రత్నారావు దోవలో ప్రేమలేఖ అందించాడట. ఆ ఉత్తరం మర్నాడు ప్రొద్దున్న తీసుకెళ్ళి హెడ్మాష్టరుగారికందజేసింది. హెడ్మాష్టరు రామయ్యగారంటే సామాన్యమయిన మనిషికాదు. విద్యార్థుల క్రమశిక్షణ విషయంలో ఆయన చాలా నిర్దాక్షిణ్యంగా, ఓ డిక్టేటర్‌లా ప్రవర్తించేవాడు.

'నా విద్యార్థులకి చదువు రాకపోతే ఫరవాలేదు. కానీ వాళ్ళల్లో క్రమశిక్షణ లోపిస్తే సహించను' అంటూండేవాడు. అప్పటికప్పుడే అన్నిక్లాసులకి నోటీస్ పంపించి స్కూలంతటినీ అసెంబుల్ చేయించారు. అందరిముందు రత్నారావుని నుంచుండబెట్టి అతనుచేసిన మహత్తరమైన పనినీ, అందుమూలాన అతనికి లభించిన బహుమతీ (టి. సి. ఇచ్చి గెంటేయడం) వివరించి, అక్కడే కేన్‌తో అతగాడిని సత్కరించి వదిలారు. ఆ తరువాత రత్నారావు మళ్ళీ నాక్కనిపించలేదు. ఇంత జరిగినా సీతంటే కుర్రాళ్ళకి వెటకారం మరింత ఎక్కువయింది.

'ఒరేయ్! అగ్గిబరాటా వస్తోందిరోయ్ తప్పుకోండి! లేపోతే టి. సి. ఇప్పించేస్తుంది...' అంటూండేవాళ్ళుఆమెని చూడగానే. ఇవిగాక కొన్ని అసభ్యకరమయిన మాటలుగూడా వినబడుతుండేవి. సీతని గురించి కొన్ని ఈక్వేషన్లు గోడమీద వెలిసినయి. ఈ పరిస్థితుల్లో ఆమెతో పాటు స్కూలుకి పోవాలంటే నాకు చచ్చేంత సిగ్గుగానూ, భయంగానూ ఉండేది. ఆమెనుంచి తప్పించుకు తిరగటానికి విశ్వప్రయత్నం చేసేవాడిని. ఆయేడు సీత యస్సెల్సీపాసయి కాలేజిలో అడుగుపెట్టిం తర్వాత నాకు కొంచెం రిలీఫ్ దొరికింది. అయినా మాకాలేజి, హైస్కూలు రెండూ ఒకే కాంపౌండ్‌లో ఉండటం మూలాన, అప్పుడప్పుడు ఆమెతో కలిసి వెళ్ళక తప్పేదికాదు. కాలేజిలో సంగతులన్నీ అప్పుడు నాతో చెప్పేది. తన స్నేహితురాండ్ర గురించి, వాళ్ళ ప్రేమికుల గురించి, వాళ్ళు తనకు చూపించిన ప్రేమలేఖలు గురించి, నవ్వుకొంటూ చెపుతూండేది. కాలేజి లెక్చరర్లకి తమాషా పేర్లు కూడా పెడుతూండేది. తోటరాముడనీ, అగ్గిరాముడనీ, చారలగుర్రం అనీ, రకరకాలుగా ఉండేవి. ప్రిన్సిపాల్ పేరు బేబి ఎలిఫెంట్ అట.

నేను యసల్సీ పాసయి పి. యు. సిలో కొచ్చేసరికి సీత బి.ఏ. సెకండియర్‌లో ఉంది. అప్పటికే 'సీత' అంటే ఎవరో కుర్రాళ్ళందరికీ తెలిసిపోయింది. కారణం ఆవిడ సైకిలు. ఆయేడు మామయ్యతో పోట్లాడి ఎలాగయితేనేం ఓ ఆడపిల్లల సైకిల్ కొనిపించింది. సీతకి సైకిలు కొనే విషయమయి అత్తయ్య, మామయ్య పోట్లాడుకొని రెండ్రోజులు మాట్లాడుకోలేదు:

'ఇదుట్టి శాడీ పిల్లయిపోతోంది. ఏ ఆడపిల్లా త్రొక్కని సైకిలు దీనికి మాత్రం ఎందుకు? మొన్నటికి మొన్న వద్దంటున్నా వినకుండా, టైలరుదగ్గరకెళ్ళి మొగపిల్లాడిలా చొక్కా, పంట్లాము కుట్టించుకొంది. దాన్ని పూర్తిగా మీరే చెడగొడు తున్నారు. దీని వెకిలిచేష్టలు చూస్తే, కుర్రాళ్ళ వేళాకోళం పట్టించక వదులుతారేమిటి? ఏమయినా సరే సైకిలు కొనడానికి వీల్లేదు...' అంటూ పట్టుబట్టింది అత్తయ్య.

కాని మామయ్య వినిపించుకోలేదు. ఆయనకి సీతంటే విపరీతమయిన ప్రేమ. కొడుకయినా, కూతురయినా తనొక్కర్తే అవడం మూలాన అడిగినదేదీ కాదనకుండా సమకూరుస్తుండేవాడు. అంచేత అత్తయ్య మాటలకి సున్నా చుర్కులేసి సైకిల్‌కొనేశాడు. అక్కడ్నుంచి ఓ వారంరోజులపాటు ఏనుగుల బంగళాదగ్గర మైదానంలో నేను సీతకి సైకిల్‌నేర్పాను. ఆ తరువాత ఝామ్మని సైకిల్‌మీద రోజూ కాలేజి కెళ్ళడం మొదలుపెట్టింది. ఆమెనిచూడ్డానికి చాలామంది పరాసుపేట రోడ్డుమీద పాయింట్రేతం స్ట్రేముకి నిరీచుంటుండే వాళ్ళు.

అదే సంవత్సరం నాకు టైఫాయిడ్ జ్వరంవచ్చింది. సుమారుగా నెల్రోజులు మంచంమీదుండిపోయాను. ఆ నెల్రోజులూ తనూ కాలేజి ఎగ్గొట్టి ఆమె నాకుచేసిన శుశ్రూషలు తలుచుకొంటే ఇప్పటికీ నాకళ్ళ వెంబడి నీళ్ళు తిరుగుతాయి. అప్పటినుంచి నేను సీతని మామూలు అమ్మాయిలాకాక ఓ దేవతలా భావించుకొనేవాణ్ని. ఆ నెల్రోజుల్లోనూ తనుబాగా చిక్కిపోయింది. జ్వరం తగ్గిం తరువాత నేను ఆమెతో అన్నాను. 'సీతా! నువ్వు మా అమ్మకంటె ఎక్కువగా ఈ నెల్రోజులూ నన్ను కనిపెట్టుకొని ఉన్నావు. ఇలాంటి విపరీతమయిన అభిమానం నేను సినిమాల్లో చూసినప్పుడు హేళనగా నవ్వుకొనేవాణ్ణి. కానీ నిన్ను అదే పరిస్థితిలో చూస్తూంటె నే నెంత అమాయకుడినా అని ఆశ్చర్యం వేసింది.' ఆరోజునుంచి సీత నాకు ఆత్మీయురాలయి పోయింది. ఏ పనయినా ఆమె సలహాలేందీ చేసేవాణ్ణికాదు. నాకు సంబంధించిన ప్రతి విషయమూ ఆమెకు తెలియాల్సిందే.

ఆ మరుసటి సంవత్సరమే సీతకి వివాహం చేయడానికి ప్రయత్నాలు జరిగినయి. అత్తయ్య కొంచెం పూర్వకాలపు మనిషవడం మూలాన సీత పెళ్ళివిషయమై మామయ్యని పోరేసింది. సీతని చూడ్డానికి మొదటగా ఓ మెడికల్ రిప్రజెంటేటివ్ వచ్చాడు. ఆరోజు నేనూ అక్కడే ఉన్నాను. అత్తయ్య ఆమెని అలంకరించబోతే ఎదురు తిరిగి 'ఛప్! వాడెవడికోసమో నేను అలంకరించుకోవడ మేమిటి? ఇదేమయినా బొమ్మలాటా?...' అనేసి చకచకనడిచి అతని కెదురుగా సోఫాలో కూలబడింది. ఆ తరువాత అతనో ప్రశ్న అడిగితే, తను రెండు ప్రశ్నలడగడం మొదలెట్టింది. ఇంత గొడవ జరిగినా ఆ కుర్రాడికి సీత నచ్చింది. పెళ్ళాడ్డానికి ఒప్పుకొన్నాడు. అందరూ తీరిగ్గా సంతోషపడుతూంటే సీత శివాలెత్తి హాల్లోకొచ్చి 'ఆ నల్లటి కుర్రాణ్ని నే జేసుకోను...' అనేసింది. మా పిన్నిపిల్ని 'అదేమిటే! నలుపయితేనేం? కుర్రాడు చక్కగా ఉన్నాడుగదా' అని నచ్చచెప్పబోతే 'అంతచక్కగా ఉంటే బాబాయికి విడాకు

## లిట్‌క్విజ్ నెం 54 – 18 క్లూలు

1. ఒక భావము మరియొకదానికి గొనిపోవునట్లే ఒక కార్యం / లక్ష్యం తరుచుగా మరియొక దానికి దారితీయును.

2. మనో ప్రవృత్తి / చపలత మరియు మీ కార్యదీక్ష జీవనమందలి రెండు ముఖ్యాంశములు.

3. దాడి చేయుటం / వెనక్కి జంకుటం ఒక సహజ స్వభావం. అది ప్రతి సామాన్య వ్యక్తియం దును ఉండును.

4. జనులలో మైత్రి/సమత్వం ఎన్నటికీ ఎచ్చోటను పూర్తిగా లభ్యపడదు.

5. మీ వయస్సు ముదురుచున్నకొలదీ క్షమత/ బుద్ధి సహజంగా మారుతూ వుంటుంది.

6. ప్రజల విశ్వాసం / సాహసం మరియు ఉద్దేశ్యం నిమిత్తం దృఢ సంకల్పంతోపాటు ఆత్మ యొక్క సహనశీలత మరియు వినమ్రత ఉండ వలయును.

7. మృత్యువు/నమ్మిక లేనిదే అభివృద్ధి ఉండనే వుండదు.

8. నిజమైన మానవుడు, అతడు నిజమైన మానవుడు కాబట్టి సర్వదా ఉదారుడు/వినమ్రుడు మరియు అహింసకుడుగానే వుండ నాశించవలెను.

9. జ్ఞానం / జీవనం యొక్క విశేషత అది ప్రకటమగుటయే.

10. వివాహం/నైతికత యొక్క సారం దాని స్థిరత్వం, వ్యాపకత అయివున్నది.

11. దృష్టి శుద్ధమైనదై మరియు రచనాపూర్ణం/ శుద్ధం అయినప్పుడు సదా ఆనందం వుంటుంది.

12. సత్తా / దురాగ్రహం పక్షపాతానికి దారి తీస్తుంది. దానివల్ల మనం మనకు కూడ హాని కలిగించుకుంటున్నాము అని స్పష్టంగా విదితమైనావరే.

13. మనం అందరము ఇచ్ఛవున్నా లేకపోయినా మనము దాని అంగమై యున్నటువంటి జగత్తుకు సార్థకతయందు తోడ్పడతాము. మరియు దాని అభ్యుదయం / ఉద్దేశ్యం వరకు సాగించుటలో సహాయం చేస్తాము.

14. జీవనమందు ప్రతి స్వల్పకార్యమున్ను, ఎంత సామాన్యమైనదైనా, సృజనాత్మక కృతియై వుండును కాబట్టి ముక్తి/సంతుష్టికి ఒక సాధనము.

15. గృహమందు తల్లికి మరి యెవ్వరున్ను ప్రతి లేరు ఆమె సాంసారిక సురక్ష / స్థిరతా రూపక జీవిత స్వరూపమై యున్నది.

16. ప్రకృతియందు అంత ప్రశాంత నిర్మలత/ సరళత గలదు.- ఎంతో ఎక్కువ ఉద్వేగం, కల్లోలం, లేక వందడి ఉరవడి కలిగినా భంగపడ నట్టిది.

17. ఇతిహాసమందు మానవుడు జగడం / యాతనను తొలగించుటకంటె కలిగించుటకే ఎక్కువగా చింతన కలిగియుండునట్లు తోస్తుంది. అది అవగాహన చేసుకొనుట కష్టసాధ్యమైన వింత యగు సత్యం.

18. విశిష్ట సమాజం యొక్క ముఖ్య విశేషత, జీవనమందు, కళయందు ఒకటి నొకటి ననుసరించే తమ ప్రతిభ / రసజ్ఞతను సంరక్షించుటయే.

## No. 54: 18 CLUES

(1) Just as one idea leads to another, one **Act / Aim** often leads to another.

(2) **Activity / Agility** of mind and Interest in your work are the two most important things in life.

(3) There is a form of **Aggression / Regression** that is normal existing in every normal human being.

(4) **Amity / Equality** among peoples has never been attained any where.

(5) **Competence / Intelligence** does, of course, vary as you grow older.

(6) Tolerance and humility of spirit must accompany great **Confidence / Courage** and great commitment to purpose.

(7) Without **Death / Faith** there is no progress.

(8) The true man, because he is a true man, must seek ever to be **Humane / Humble** and non violent.

(9) The one characteristic of **Learning / Life** is that it unfolds.

(10) The essence of **Marriage / Morality** is its stability and universality.

(11) When vision is pure and when creation is **Perfect / Pure** there is always joy.

(12) **Power / Prejudice** leads to discrimination even when it is clear that by means of it we are also insuring ourselves.

(13) We all, whether we will it or not, contribute to the meaning of the universe to which we belong and help in working out its **Progress / Purpose**.

(14) Every little work in life, however humble, can become an act of creation and there for a means of **Salvation / Satisfaction**.

(15) There is no substitute for the mother in the home. The living embodiment of domestic **Security / Stability**.

(16) There is quiet **Serenity / Simplicity** about nature which is not marred by even so much as a show of hurry disorder or bustle.

(17) Down history man seems to have been more concerned to cause **Strife / Suffering** than to ease it; A strange fact that it is difficult to understand.

(18) The main characteristic of a classical society is its cultivation of **Talent / Taste**, simultaneously seen in life and art.

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంధకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంధకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిట్‌క్విజ్ పేక్లలో ప్రచురించబడును.

## రౌడీ పిల్ల

లిచ్చి ఆ కుర్రాణ్ణి నువ్వేచేసుకో!' అని క్రూయల్‌గా జవాబిచ్చింది. దాంతో మా పిన్నికి వళ్ళు మండిపోయి సీత నలాచిన్నా పెద్ద లేకుండా పెంకిగా, పెంచినందుకు అత్తయ్యని దులిపేసి బండకేసింది. నాకు మాత్రం సీత ఆ కుర్రాణ్ణి వద్దనటంలో అనుచితం ఏమీ కన్పించలేదు. తెల్లగా, అందంతో మెరసిపోయేసీతకి ఆ కుర్రాణ్ణి కట్టెయ్యడం చూడడం నాకూ నచ్చలేదు. అంత ధైర్యంగా వ్యవహరించినందుకు ఆరోజు సాయంత్రం సీతకి అభినందలు తెలిపేను.

సీత ఫైనలియర్ ఎగ్జామిన్స్ వ్రాశేసింది. సెలవులిచ్చారు. ఎలాగోలా ఆమెకి వివాహం చేయడానికి ప్రయత్నాలు చురుకుగా జరిగినయి. ఆరోజు వాళ్ళింటికెళ్ళేసరికి తనగదిలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతోందామె.

'ఏమిపుస్తకం అది!' అంటూ లాక్కొని చూశాను.

'సెక్స్ విజ్ఞానం' గురించి వ్రాయబడిన ఇంగ్లీషు పుస్తకం అది.

'ఏమిటీ పుస్తకం?' ఆశ్చర్యంగా అడిగాను.

'ఏమిటేమిటోయ్ ! ఇంగ్లీష్ నీకు రాదూ ?' అంది విసుగ్గా.

'అందుకే అడుగుతున్నా! ఇలాంటి పుస్తకాలా చదవటం ?'

'ఏం ? తప్పా'

నాకు జవాబు తెలీలేదు. అది తప్పో కాదో నాకు తెలీదు. సీతలాంటి అందమయిన అమ్మాయి ఇలాంటి పుస్తకాలు చదవటం నాకంతగా నచ్చలేదనే చెప్పాలి. అదే అంటే ఆమె కోపంతో అదిరిపడింది.

'బ్లడీ ఫెలో ! నువ్ ఓ అమ్మమ్మగా పుట్టివుంటే బావుండేది. మనం అన్ని విషయాలు గురించీ తెలుసుకొంటున్నప్పుడు సెక్స్ గురించి ఎందుకు తెలుసుకోకూడదు! ఫారిన్‌లో సెక్స్ కూడా ఓ సబ్జెక్టుగా 'టీచ్' చేయడం లేదూ ? వాళ్ళంత పిచ్చాళ్ళా?' అంటూ వివాదంలోకి దిగింది.

'అది సరే! నీకు ఏదో సంబంధం నిశ్చయ మయిందిటగా?' అన్నాను టాపిక్ మారుస్తూ.

నెం. 52 లో 4 సరిఅయిన కరెక్టు విజేతలు ఒక్కొక్కరు 6500 పొందిరి. మిని B లో 14 విజేతలు ఒక్కొక్కరు రు. 715 పొందిరి. ఒక్క తప్పుతో పంపిన 42 విజేతలు ఒక్కొక్కరు రు. 240 పొందిరి.



—: ముఖ్యాంశములు :—

1. మొదటి బహుమతి మొత్తం పెంచబడింది.
2. మినిక్విజ్ క్లూలు తగ్గించబడినవి.

ఎప్పటిదైనా, ఎక్కడిదైనా లిట్ క్విజ్ మీకు ప్రశాంతతనిచ్చును.

లిట్ క్విజ్ నెం. 54 అధికార ఎంట్రీ ఫారము

ఆఖరు ముగింపు తేది 10-9-69 బుధవారం

ADDRESS: LITQUIZ No. 54. ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)

గమనిక: 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M. O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరించబడును. (4) I. P. O. క్రాస్‌చేయవద్దు. అది లిటక్విజ్ నెం. 54, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| | Re 1 | 1 | | Re 1 | 2 | | Re 1 | 3 | | Re 1 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ACT | AIM | 1 | ACT | AIM | 1 | ACT | AIM | 1 | ACT | AIM |
| 2 | ACTIVITY | AGILITY | 2 | ACTIVITY | AGILITY | 2 | ACTIVITY | AGILITY | 2 | ACTIVITY | AGILITY |
| 3 | AGRESSION | REGRESSION | 3 | AGRESSION | REGRESSION | 3 | AGRESSION | REGRESSION | 3 | AGRESSION | REGRESSION |
| 4 | AMITY | EQUALITY | 4 | AMITY | EQUALITY | 4 | AMITY | EQUALITY | 4 | AMITY | EQUALITY |
| 5 | COMPETENCE | INTELLIGENCE | 5 | COMPETENCE | INTELLIGENCE | 5 | COMPETENCE | INTELLIGENCE | 5 | COMPETENCE | INTELLIGENCE |
| 6 | CONFIDENCE | COURAGE | 6 | CONFIDENCE | COURAGE | 6 | CONFIDENCE | COURAGE | 6 | CONFIDENCE | COURAGE |
| 7 | DEATH | FAITH | 7 | DEATH | FAITH | 7 | DEATH | FAITH | 7 | DEATH | FAITH |
| 8 | HUMANE | HUMBLE | 8 | HUMANE | HUMBLE | 8 | HUMANE | HUMBLE | 8 | HUMANE | HUMBLE |
| 9 | LEARNING | LIFE | 9 | LEARNING | LIFE | 9 | LEARNING | LIFE | 9 | LEARNING | LIFE |
| 10 | MARRIAGE | MORALITY | 10 | MARRIAGE | MORALITY | 10 | MARRIAGE | MORALITY | 10 | MARRIAGE | MORALITY |
| 11 | PERFECT | PURE | 11 | PERFECT | PURE | 11 | PERFECT | PURE | 11 | PERFECT | PURE |
| 12 | POWER | PREJUDICE | 12 | POWER | PREJUDICE | 12 | POWER | PREJUDICE | 12 | POWER | PREJUDICE |
| 13 | PROGRESS | PURPOSE | 13 | PROGRESS | PURPOSE | 13 | PROGRESS | PURPOSE | 13 | PROGRESS | PURPOSE |
| 14 | SALVATION | SATISFACTION | 14 | SALVATION | SATISFACTION | 14 | SALVATION | SATISFACTION | 14 | SALVATION | SATISFACTION |
| 15 | SECURITY | STABILITY | 15 | SECURITY | STABILITY | 15 | SECURITY | STABILITY | 15 | SECURITY | STABILITY |
| 16 | SERENITY | SIMPLICITY | 16 | SERENITY | SIMPLICITY | 16 | SERENITY | SIMPLICITY | 16 | SERENITY | SIMPLICITY |
| 17 | STRIFE | SUFFERING | 17 | STRIFE | SUFFERING | 17 | STRIFE | SUFFERING | 17 | STRIFE | SUFFERING |
| 18 | TALENT | TASTE | 18 | TALENT | TASTE | 18 | TALENT | TASTE | 18 | TALENT | TASTE |

**54** FREE AFTER 4 COUPONS

**MINIQUIZ**

| | | | |
|---|---|---|---|
| ACT | AIM | CONFIDENCE | COURAGE |
| ACTIVITY | AGILITY | DEATH | FAITH |
| AGRESSION | REGRESSION | HUMANE | HUMBLE |
| AMITY | EQUALITY | LEARNING | LIFE |
| COMPETENCE | INTELLIGENCE | MARRIAGE | MORALITY |




3/6/ ANNUAL SUB. No.______ NEW______

ఈ క్విజ్ ప్రవేశమునకుచెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/—M. O. రసీదు/I.P.O./లిటక్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.........

**54** (A5VP)

CAPITAL LETTERS

NAME..........................................

..................................................

ADDRESS ....................................

..................................................

..................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించిపంపవలెను

లిటక్విజ్ వీక్లీకి, పాత మరియు క్రొత్త చందాదారులు 4వ కూపనులోని కడపటి 4 క్లూలకు సరియైన జవాబులు యిచ్చినయెడల, రు. 1500 లను 1 ; 2 నిష్పత్తిలో పంచుకొనెదరు. తేదీ 21—8—69 నుండి 10—9—69 వరకు, గల కాలములో చందాలు పంపినవారు కొత్త చందాదారులు. వారు 'మినిక్విజ్' క్రింద యివ్వబడి 'కొత్త' అను పదమునకు పాటా కొట్టవలెను. 'పాత' చందాదారులు తమ చందా నెంబరు వ్రాయవలెను.

ఆఖరు ముగింపు తేది : 10—9—69.
సొల్యూషన్ ఆంధ్రపత్రిక: 14-9-69.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 10 పైసల స్టాంపు, స్వంత అడ్రసు గల కార్డును

# రౌడీ పిల్ల

'అవునట! అమ్మ అంటోంది.' అంది నవ్వుతూ.

'కుర్రాడు నచ్చాడా ?'

'తర్వాత చెబుతాగానీ, సాయంత్రం నాలుగింటి కోసారి నువ్ రావాలి! నీతో ఓ చిన్న పనుంది...' అంది మెల్లగా.

'ఏమిటది ?' అన్నాన్నేను ఆశ్చర్యంగా.

'ముందు నువ్ రావోయ్. తర్వాత చెప్తాను. ఆడపిల్లలాగా భయపడతావేం?' అంది నవ్వుతూ.

సాయంత్రం నాలుగింటికి మళ్ళీ ఆమె దగ్గర కెళ్ళాను. సీత అప్పటికే డ్రస్ చేసుకొని ఉంది. నల్లని పువ్వులచీర కట్టుకొని అదేరంగు జాకెట్ వేసుకొంది. నన్ను చూడగానే 'పద అలా తిరిగొద్దాము' ... అంటూ బయల్దేరింది. రోడ్డు మీద కొచ్చేసరికి అప్పుడే మంగినపూడి బస్ వస్తోంది.

'మనం ఈ బస్‌లోనే వెళ్ళాలి!' అంది సీత.

'ఎందుకు ?' అన్నాన్నేను ఆశ్చర్యంగా.

'ఎందుకేమిటి నీ మొఖం! వెధవ ప్రశ్న లేయకు...'

ఇద్దరం బస్‌లో సీషోర్ చేరుకొన్నాము. ఇసుకలో తీరంవెంబడే చాలాదూరం నడిచాము. నేను పూర్తిగా సస్పెన్స్‌లో మునిగిపోయి ఉన్నాను. ఎప్పుడూ ఏదో మాట్లాడే సీత అసలు నోరు మెదపడమే లేదు. సీరియస్‌గా ఏదో ఆలోచిస్తోంది. బాగా ఎదిగిన సరుగు చెట్లమధ్య ఇద్దరం కూలబడ్డాము.

'ఏమిటి విశేషాలు చెప్పు!' అన్నాను.

తలెత్తి నావంక చూసింది సీత. ఆమె మొఖం మీద అస్తమించేస్తున్న సూర్యుడి నీరెండపడి తళ తళ మెరుస్తోంది. సముద్రం ఘోష అంతకంతకూ ఎక్కువవుతోంది.

'ఎన్నాళ్ళకి సీతా! నిజమయిన ఆడదానిలా అలంకరించుకొన్నా వివాళ. ఎంత బావున్నావో తెలుసా ఇప్పుడు ?' ఆమె వంకే చూస్తూ అన్నాను.

చాలాదూరంలో నలుగురు కుర్రాళ్ళు సముద్రం లోపలికివెళ్ళి స్నానం చేస్తున్నారు.

'వాడన్నాయూ మీన్ ? ఇన్నాళ్ళూ మొగాడిలా ఉన్నానా?' అంది సీత నవ్వుతూ.

'ఏం ? ఇంకా సందేహమా ?'

'ఏమో! నువ్వన్నది నిజమే అయుండొచ్చు. కాని ఆడది తలొంచుకు నడవటం, ఎప్పుడూ సిగ్గు పడుతూండడం, పాంట్లు, షర్టులు వేసుకోకుండా చీరలే కడుతూండడం, గాజులు వేసుకోడం, ఒక్క మొగాడికే హృదయం ఇచ్చేయడం, వాడు గర్భంచేసి పారిపోతే ఘొల్లున ఏడ్చేయడం, మొగుడు ఛస్తే మగవాడిలా రెండో పెళ్ళి చేసుకోకుండా మూల కూర్చుండటం — ఇవన్నీ ఆడదాని లక్షణాలని ఈ కుళ్ళు సన్యాసులు, సన్యాసినులు అనుకొంటున్నారు. ఇలాంటి రిపేరుకి వీల్లేని ఆలోచనలు తొంభయితొమ్మిది పాళ్ళు కేవలం ఆడాళ్ళల్లోనే వున్నాయి. పైగా పక్షపాటా లేక మన రచయిత్రులు ఉండుండి ప్రతి కథలో మగాళ్ళని దుమ్మెత్తి పోస్తూంటారు — ఆడదాన్ని అణగ్రదొక్కిన మగజాతి మీద వ్యాసం వ్రాసి ప్రక్కింటి కుర్రాడికిచ్చి పోస్టు చేయిస్తారు. ఆవిడే కవరు స్వయంగా పోస్టులో వేయడానికి ఆడతనం అడ్డొస్తుంది. అక్కడే మొగాడు ఎదిగిపోతున్నాడు. వీళ్ళు తాము చేయలేని పనుల గురించి నవలలు వ్రాయగలరు. కాని అదే పని మరో ఆడపిల్ల చేస్తే గుండె లవిసేలా బాధపడి ప్రచారాలు మొదలెడతారు...'

'ఈ స్పీచ్ ఇవ్వడానికి నన్నింతదూరం తీసుకొచ్చావ్, నీకేమయినా న్యాయంగా ఉందా ఇది ?...' మధ్యలో అడ్డు తగిలాను. సీత ఆగిపోయి కిలకిల నవ్వేసింది.

'నిజమే! అనవసరమయిన టాపిక్! కాని నేనీ లెక్చరు ఇవ్వడానికి నువ్వే కారణం. నేనివాళ ఆడదానిలా కనిపిస్తున్నానని ఎగతాళి చేశావ్...సరే! అదలావుండనీగాని...' ఓ నిముషం ఆగి మళ్ళీ అందామె 'నిన్నటి నుంచి అమ్మకీ నాకూ యుద్ధం జరుగుతోంది — అదీ నీ విషయంలో...' ఆఖరి మాటలనేప్పుడు నావంక చూడకుండా సముద్రంవంక చూస్తూ అందామె

అదిరిపడ్డాను.

'నా విషయంలోనా? ఎందుకూ?'

సీత జవాబు చెప్పలేదు. తలవంచుకుంది.

'మాట్లాడవేం?' అన్నాన్నేను విసుగ్గా.

'ఎందుకో చెప్తాను. ముందు నేను నిన్ను కొన్ని ప్రశ్నలడగాలి. దమ్ముంటే జవాబియ్యి...' నవ్వుతూ అంది.

'ఏమిటా ప్రశ్నలు?'

'నా గురించి ఖచ్చితంగా నీ అభిప్రాయం చెప్పు!'

నాకు మతిపోయినంత పనయింది. సీతకి కొంచెం ప్రెజెన్స్ ఆఫ్ మైండ్ రాలేదు కదా అని పించింది.

'నీ వంట్లో బావుందా సీతా! ఇలా అడిగానని ఏమీ అనుకోకు. ఎంచేతంటే నీ మాటలు నాకేమాత్రం అర్థం కావడం లేదు—'

నా మాటలకి సీతకి కోపం కొంచెం ఎక్కువగానే వచ్చుండాలి.

'యూ ఆర్ ఇన్నోసెంట్ ఫూల్!' అంది. కొంచెంసేపు నిశ్శబ్దంగా గడిచింది. సూర్యుడు పూర్తిగా అస్తమించేశాడు. సంధ్య చీకటి అలుముకొంటోంది. అలలు ఉధృతం ఎక్కువయింది. సీషోర్‌లో మేమిద్దరం తప్పితే మరెవ్వరూ కనిపించటంలేదు.

'ఇక పోదాం పద!' అంటూ లేచి నుంచున్నాను. 'నీ తరహా చూస్తుంటే ఇవాళ ఇంటికి వచ్చేట్టులేవు...'

చేయి అందించింది సీత. అందుకొని ఆమెని పైకి లేపబోయాను. కాని హఠాత్తుగా ఆమె నన్ను ముందుకి లాగటంతో ఆమె మీదికి తూలిపడ్డాను.

నా మెడచుట్టూ చేతులువేసి నా పెదాల మీద ముద్దుపెట్టుకొంది సీత.

నాకు అయోమయంగా వుంది. ఇది ప్రథమ స్త్రీ స్పర్శ. అదీ అందమయిన సీతది. నా శరీరం స్వాధీనం తప్పుతోంది. కానీ నా మనసు నాకు వ్యతిరేకంగా వుంది. సీతని ఈ విధంగా నేనెప్పుడూ ఊహించలేదు. సీత అందమయిన ఓ ఆడపిల్లగా ఎప్పుడయినా అనిపించినా, మా ఇద్దరినీ ఈ విధంగా ఊహించుకోడానికి వీలుకాని స్నేహం, బంధుత్వం ఆ ఆలోచనని అక్కడే అంతం చేసినయి.

చీకటి పూర్తిగా వ్యాపించింది. ఇద్దరం బస్‌స్టాండ్‌వేపు నడకసాగించాము.

'మనిద్దరం పెళ్లాడితే ఎలా వుంటుందీ?' సీత అంది.

పెళ్లనేసరికి నా గుండెలు కొంచెం వేగంగా కొట్టుకొన్నయి. ఇది జరగటం కష్టం. నా తల్లిదండ్రులూ, ఆమె తల్లిదండ్రులూ, ఎదిరించేంత ధైర్యం నాకు లేదు. నేను చాలా సాధారణమయిన మనిషిని. సీత అన్నట్టు పిరికి రాస్కెల్‌ని కూడా నేమో. నన్ను పెంచిన పెద్దాళ్లంటే భయం. వాళ్లు గీచిన పరిధిలోనే గడపటం నాకిష్టం. వాళ్ల నెదిరించేంత తెలివి తేటలుకూడా నాకు లేవు. అవి భగవంతుడు నాకివ్వలేదు. అందుకు భగవంతుడంటే అప్పుడే మొదటిసారిగా నాకు ద్వేషం కలిగింది.

'కాని...సీతా! నువ్వన్నది జరగటం చాలా కష్టం!'

'ఇదే! నీనుంచి ఇలాంటి జవాబే వస్తుందని అనుకొన్నాను. నాకు తెలుసు నువ్వెంత మొనగాడివో! అందుకే నిన్నిక్కడికి లాక్కొచ్చేను......ఓసారి నీ నోటినుంచే విందామని పించింది. నా సంగతి నీకు బాగా తెలుసు. చిన్నప్పట్నుంచీ ఎంచేతో పెద్దాళ్లువద్దన్న ప్రతిపనీ చేయాలనిపించేది. ఓసారి అమ్మ అంది నీ గురించి, నువ్వు ఓ ఏడెనిమిదేళ్లు ఎక్కువ వయసుతో ఉంటే నన్ను నీకిచ్చి చేసేవారుట. వెంటనే అనిపించింది నాకు. చిన్నాడయితేమాత్రం తప్పేమిటి? భార్యాభర్తల్లో ఆడది చిన్నదయి వుండాలి అనే రూల్ ఎవరు తయారు చేశారు? ఆడది పెద్దదవుతే ఏం రోగం?' ఆవేశంగా అంది సీత.

నేనేమీ మాట్లాడలేదు.

కొంచెంసేపయిన తర్వాత మళ్ళీ తనే అంది.

'పోనీ ఈ విషయం ఇంకేమీ ఆలోచించకు. నువ్వు ఒప్పుకో ఉంటే అది వేరే సంగతి. ఇక నాన్నారితో చెప్పేస్తాను. నేను ఎవరినయినా సరే పెళ్లాట్టానికి రడీ అని. వాళ్లని తృప్తి పరచటానికయినా పెళ్లాడేయాలి. ఏం చేయను మరి...'

రోడ్డు చేరుకున్న పదినిమిషాల్లో బస్ వచ్చింది. ఇద్దరం ఓ అరగంట తరువాత ఇళ్లు చేరుకొన్నాం. తరువాత కొన్ని రోజులవరకూ నేను సీతని చూడలేదు. చూడాలనిపించనూ లేదు. ఏదో పిచ్చెక్కినట్లుగా ఉండేది.

రిజల్ట్సు వచ్చినయి. సీత సెకండు క్లాస్‌లో పాసయింది. ఆరోజు అనుకోకుండా సీతని కలిశాను. నేను చిలకలపూడి వెళ్తుంటే ఇంకో ఇద్దరి స్నేహితురాండ్రతో కలిసివస్తూ కనిపించింది. నన్ను చూసి నవ్వింది.

'కంగ్రాచ్యులేషన్స్' అన్నాను.

'థాంక్యూ! పాండురంగని గుడికివెళ్ళి

(52వ పేజీ చూడండి)



# శ్రావణ పౌర్ణమి

శ్రావణ శుద్ధ పౌర్ణమికి శ్రావణ పౌర్ణమి అనే పేరు బహుళ ప్రచారంలో ఉన్నది. తక్కిన పున్నమలకంటె ఇందులో ఒక విశేషమున్నది. ద్విజులు ఈనాడు అధ్యాయోపా కర్మను ఆరంభిస్తారు. అధ్యాయోపా కర్మఅంటే వేదాధ్యయన ప్రారంభమన్నమాట. అదే యిప్పుడు సంగ్రహంగా ఉపాకర్మ అని వ్యవహరింపబడుతూ వున్నది. ఇది బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య-సాధారణమైనా, యిప్పుడు హెచ్చుగా బ్రాహ్మణులే ఆచరిస్తూ ఉన్నారు. యజ్ఞోపవీతాలు ధరిస్తూవుండే అన్ని జాతులవారూ నేడు కొత్త జన్నిదాలను వేసుకుంటారు.

ఈ నాడు జరపవలసిన విధి ఏమిటంటే — ఉదయాన్నే స్నానాదులు ముగించుకొని సంధ్యావందనం చెయ్యాలి. తర్వాత, కాముకేసిన పాయశ్చిత్తకమునానికి ప్రాయశ్చిత్తంగా కామో ఒకార్షీజ్జపం చెయ్యాలి. 'నా లోపాలన్నీ కామక్రోధాదులవల్ల జరిగినవే కాని, నేను కావాలని చేసినవి కావు. నేను చేయించినవి కావు' అనే అభిప్రాయం కల ఆ జపము ఆ తప్పులకు ప్రాయశ్చిత్తరూప మైనది.

ఆ తర్వాత నదికో, చెరువుకో పోయి స్నానం చేసి కొత్త యజ్ఞోపవీతాన్ని, నరాంజిని, అజినాన్ని ధరించి ఉపాకర్మ జరుపుకోవాలి. దాని తంతు సంగ్రహంగా ఉపనయన కర్మే అని అనుకోవాలి. అధ్యయనోప క్రమానికి చిహ్నంగా ఆయా వేదాల ఆద్యంత వాక్యాలను పఠించడం జరుగుతుంది. అప్పటికే చాలా పొద్దు పోతుంది. నాటికి ఉపాకర్మ పరిసమాప్తమవుతుంది. దానికి అంగంగా మర్నాడు వెయ్యన్ని ఎనిమిది సార్లు గాయత్రీ మంత్రాన్ని జపించవలసి వుంటుంది.

అయితే-నూతన విద్యారంభం యిప్పుడే ఎందుకు చెయ్యాలనే ప్రశ్న రావచ్చును. వర్షారంభానం యేమిటంటే — ఇది వర్షాకాలం కాబట్టి వర్షాలు ఎడతెగకుండా కురుస్తూ వుంటాయి. అందువల్ల ఎక్కడికీ వెళ్ళడానికి అవకాశం వుండదు. సస్యాలు మొలకలెత్తి పెరుగుతూ వుంటాయి కాబట్టి పాలించనిక్కూడా వుండదు. తీరిక వుంటుంది కాబట్టి చదువుకు మంచి అవకాశం ఏర్పడుతుంది. కొందరు హస్తా నక్షత్రం ఉపాకర్మకు ముఖ్యమని భావిస్తారు. అది సామాన్యంగా వినాయక చవితి నాడుగాని, దానికి ముందురోజునకాని వడుతుంది. సామవేదులు అప్పుడే ఉపాకర్మ చేసుకుంటారు. భాద్రపదంలో ఉపాకర్మ చేసుకొనుటకు ప్రమాణం వున్నది.

'శ్రావణ్యాం ప్రౌష్ఠపద్యాం వా
వ్యపాకృత్య యథావిధి
యుక్తశ్ఛందాం స్యధీయేత
మాసాన్విప్రోఽర్ధ పంచమాన్'

శ్రావణంలోగాని భాద్రపదంలో గాని విప్రుడు యథావిధిగా ఉపాకర్మ చేసుకుని అయిదున్నర మాసాలు వేదాలను అధ్యయనం చేయాలని యీ శ్లోకం అభిప్రాయం!

పూర్వం వేదాధ్యయన ప్రారంభంలో దీక్షకోసమని యజ్ఞోపవీత ధారణం ఆచారంగా ఏర్పడి ఉండినట్లు కానవస్తుంది. తర్వాత తర్వాత ఆ ఆచారమే కంకణ ధారణంగా పరిణమించి, ఇతరవర్ణాలలో రక్షాబంధనంగా ఏర్పడి ఉండవచ్చును. అందువల్లనే శ్రావణపూర్ణిమకు రక్షాపూర్ణిమ అనేపేరుకూడా ఏర్పడింది. ఇదే వ్యవహారంలో రాఖీపూర్ణిమ.

పూర్వం దేవదానవులకు యుద్ధం జరిగినప్పుడు ఒకసారి యింద్రుడు చిత్తుగా ఓడిపోయి సహచరులతోపాటు అమరావతిలో దాగుకోవలసి వచ్చింది. రాక్షసరాజా పాలనవల్ల ముల్లోకాల్లో సూకర్మలు నష్టమైపోయాయి. దేవపూజలు మూలపడ్డాయి. ధర్మం నశిం



చింది. రాక్షసులు అమరావతినికూడా ముట్టడించారు. ఇంద్రుడు యుద్ధసన్నద్ధుడయి రాక్షసులను ఎదిరించడానికి సిద్ధమయ్యాడు. కాని, దేవగురువైన బృహస్పతి తొందరపడవద్దనీ, అది యుద్ధానికి తగిన సమయంకాదనీ సలహా యిచ్చాడు. కాని ఆమాటలు ఇంద్రుడికి రుచించలేదు.

వీరి మాటలను వింటూవున్న శచీదేవి వారిని సమీపించి యింద్రుణ్ణిచూచి "నేడు మహాపర్వదినం. నేను మీకు రక్షకడతాను. ఆ రక్షవల్ల మీకు తప్పకుండా జయం కలుగుతుంది" అని రక్ష కట్టినదట! ఇంద్రుడు ధైర్యసాహసాలతో అకస్మాత్తుగా శత్రువులమీదపడి, వారిని ఓడించాడు.

ఓడిపోయిన రాక్షసులు తమ గురువైన శుక్రాచార్యులవద్దకుపోయి తమ స్థితిని తెలియజేశారు శచీదేవి యింద్రుడికి రక్ష కట్టినదనీ, ఆ రక్షాబంధ ప్రభావం వల్లనే అతడు జయించాడనీ, ఇప్పుడతనిని గెలవలేమనీ, కొన్నాళ్ళు ఓపికపట్టాలనీ చెప్పి సమువాయించి పంపివేశాడు. రక్షాబంధశక్తి అట్టిది! సంకల్ప కార్యసిద్ధి కోసమే యీనాడు రక్ష కట్టుకోవడం ఆచారమైంది.

ఈనాడు ఉదయాన్నే స్నానంచేసి, దేవ పితృకార్యాదులను తీర్చుకుని, అపరాహ్ణంలో అక్షతలు, ఆవాలు మొదలైన వాటిని పట్టువస్త్రంలోగాని, నూలు వస్త్రంలోగాని చిన్న మూటకట్టి, గృహమధ్య ప్రదేశంలో పీటపై ఉంచి పూజించి, పురోహితుని మూలంగా దాన్ని చేతికి కట్టుకోవాలి. అప్పుడీ మంత్రం చెప్పవలసి ఉన్నది—

'యేన బద్ధో బలీ రాజా,
దానవేంద్రో మహాబలః,
తేన త్వా మభి బధ్నామి
రక్షే మాచల మాచల.'

'ఓ రక్షా! రాక్షసరాజూ, మహాబలవంతుడూ అయిన బలిని నీవు కట్టివేశావు. కనుక నేను నిన్ను కట్టుకుంటున్నాను. చలించక ఉండు' అని దీని అర్థం!

—బు. వేం. ర.

# సరివిస్పం



సీరియల్

శిఖా వెంకటరమణ

**జరిగిన కథ**

రాజశేఖరం, గిరిధర్ ఇద్దరూ చిన్నప్పటి నుంచి సన్నిహితంగా వుండేవారు. వారి కుటుంబాలు కూడా చాలా అన్యోన్యంగా వుండేవి. అకస్మాత్తుగా రాజశేఖరం వూరు విడిచి కొనసీమకి వెళ్లవలసి వస్తుంది. రాజశేఖరం కూతురు జయ. గిరిధర్ కొడుకు సాంబశివం (సాంబు). సాంబశివాన్ని విడిచిపెట్టి వెళ్లడమంటే జయకి దుఃఖం ముంచుకొస్తుంది. తప్పనిసరిగా విడిపోవలసి వస్తుంది. జయ మేనమామ కొడుకు కాళిదాసు. చదువుల కోసం మద్రాసుకి వస్తారు. అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తుపడతాడుగాని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో ఈన కథ చెబుతాడు. రాజశేఖరం జయని పెళ్లి చేసుకోమని కాళిదాసుని అడుగుతాడు. భారతికి అన్యాయం చెయ్యడం అతనికి ఇష్టంలేదు. జయ సాంబుని గుర్తుపట్టనట్టు చెబుతుంది. మార్గరెట్ సాంబుని ప్రేమించిన వ్యక్తి. ఆమెకి జయ అంటే గిట్టదు.

## 5

బూట్ల చప్పుడు విని మార్గరెట్ పరుగున వచ్చి అతని మెడ చుట్టూ చేతులువేసి బావురుమంది: 'రేపే వెళ్లిపోతున్నావు మై డియర్ బోయ్. నువ్వంటే నా అభిమానాన్ని అర్థం చేసుకోవేం? నాకన్నా అంతగత్తా నీ జయ. పన్నెండు కితా యేడిపించుకు తింటావు? నాతో స్నేహం కొన్ని లిమిట్స్ అని చెప్పలేక పోయావా? నేనే బుద్ధిలేనిదాన్ని. బోయ్ ఫ్రెండ్వి అనే యెంతో ప్రాణం పెట్టాను. పోనీ ఒక పని చెయ్యకూడదూ.'

అతను కళ్లు చిట్లించి చూశాడు ఆ పిల్లవైపు. కత్తిరించుకున్న జుట్టు మెడల వరకూ వ్రేలాడుతోంది. నీలంరంగు కళ్లు నీళ్లల్లో చేపపిల్లల్లా బెదురుతున్నాయి. యేడుస్తున్న మార్గరెట్ వెన్నెల్లో మరీ అందంగా కనిపిస్తోంది. చల్లగాలి వొంటిని చీల్చేస్తోంది. మత్తుగా సాంబశివం మాట్లాడేస్థితిని దాటిపోతున్నాడు. మార్గరెట్ కంటికీ మింటికీ యేకధారగా దుఃఖిస్తోంది. అతనికి కలో వాస్తవమో అర్థం కాకుండా వుంది. అతను నిశితంగా చూస్తూ సిగ్గుపడుతున్నాడు తన అవివేకానికి. 'వాట్ యె ఫూల్ యూ ఆర్—అమ్మా, నాన్నా వెళ్లిపోతే నే నెలా వుండగలను? చూడు మార్గరెట్ మనం మానవ మాత్రులం. సంఘం, కట్టుబాట్లు అందరికీ వుండి తీరాలి. నిన్ను భర్తనై భరించే శక్తి నాకు లేదు. నా తరువాత అమ్మా నాన్నలకి పిల్లలేవుంటే నేను తెగించేవాడిని. కానీ ...వాళ్లకి నే నొక్కడినే కొడుకుని. నా కోసం వాళ్ల ఆయుర్దాయం సగమై పోకూడదు.'

'పుట్టిన వెంటనే భార్యా భర్తలిద్దరూ చెరో పక్కనా కూర్చుని పుట్టిన పసికందు మీద యెన్నో బంగారు కలలు కంటారు. బొడ్డు కోయకుండానే భవిష్యత్‌ని వూహించుకుని మహదానంద పడిపోతారు. మేము హిందువులం' అతను ఆయాసంగా ఆగేడు. సాంబశివాన్ని కౌగలించుకుని అతని గుండెల మీద తల వాల్చి పౌరుషంగా 'నూ యింకా,' అన్నది.

'సమాజం ప్రతి జాతికీ వున్నది కాదనను. మీ సమాజంలో యిలా జాతి భేదం లేకుండా చేసుకుంటే మొదట కోప్పడినా మీలో మీరే తరువాత తరువాత సమర్థించుకుపోతారు. చర్చిలో ఆ మనిషిని మీ జాతిలో కలుపుకుని తృప్తి పడతారు. మా బ్రతుకులు అలాంటివి కావు...'

'ఒక మనిషి చేసిన తప్పుని వేయి రకాలుగా చిలవలు, పలవలు అల్లి వెలివేసే వరకూ నిద్రపోనివ్వరు. నేనే నిన్ను చేసుకుంటే సంఘంలో నాకు వుండవలసినా, యివ్వవలసినా గౌరవ మర్యాదలు వుండవు. యిప్పుడు ఖచ్చితంగా నాకు పద్ధెనిమిదేళ్లు. నువ్వింకా చిన్నపిల్లవు. మనం కోర్టులో పెళ్లి చేసుకున్నా అది చెల్లదు. నేను చదివిన పుస్తకాలనిబట్టే యిన్ని మాట్లాడగలుగుతున్నాను. మనం మంచి యవ్వనంలో వున్నాం. నా స్వార్థం కోసం స్నేహాన్ని వుపయోగించుకున్నట్లే, నీ శరీరాన్ని కళంకం చేయలేను. ఒద్దు మార్గరెట్, నువ్వూ, నీ స్నేహం తలుచుకుంటూంటే నా మనసు తృప్తిగా జో

ర్శిస్తోంది.

'ఒక్క మాట విని నన్నర్థం చేసుకో.'

మార్గరేట్ అప్పటికి తలెత్తి చూసింది అతనివైపు.

'నువ్వేదో ఆవేశంలో వున్నావు. ఆరేళ్ల స్నేహానికి గుడ్‌బై చెప్పడం యిట్ యీజ్ నాట్ యె జోక్. మా యిళ్లల్లో వ్యక్తుల స్వేచ్ఛలకి యిచ్చేందుకే పదిరకాల ఆరాలుతీసి ఆర్భాటాలు చేస్తారు. అటూ ఇటూ యేడు తరాల మంచి చెడులవి కనుక్కొని అప్పుడు గాని చేసేందుకు సాహసించరు. జాత్యంతరం, దేశాంతరం వివాహాలే చేసుకుంటే యిక మన భవిష్యత్‌కి తిలోదకాలు యివ్వాల్సిందే.'

మార్గరేట్ హేళనగా నవ్వింది. 'భవిష్యత్...అని పదిసార్లంటున్నావు. అదంతా మన చేతిలోనే వున్నది. మనం నవ్వితే సమాజం మనతోబాటు నవ్వుతుంది. నవ్వి తీరుతుంది. మనం చేసేపని మంచిదే కనుక తప్పకుండా సంఘం సానుభూతి వుంటుంది. నాన్నగారిని అడిగి నీతో యిండియా వచ్చేస్తాను నేను.'

'మార్గరేట్!' సాంబశివం ఆశ్చర్యంగా చూశేడు.

'నువ్వెలాగూ నీ తల్లిదండ్రుల్ని వదులుకోలేవు. ఆ విషయం నాకు బాగా తెలుసును. చూడు మైడియర్ బోయ్ నీకోసం నేను నా తల్లిదండ్రుల్ని వదులుకోలేనంటావా.'

'యెంత పిచ్చిదానివి నువ్వు?' సాంబశివం ప్రేమగా మార్గరేట్ కత్తిరింపు జుట్టులోకి వేళ్లు పోనిచ్చి నిమురుతూ వుండిపోయేడు. ఆ పిల్ల నుదుటిమీద యెంతో ప్రేమగా ముద్దు పెట్టుకున్నాడు. 'నాకు తెలుసును నువ్వు యెంత పనైనా చేస్తావు నాకోసం. ఒక్కమాట. మా హిందువుల గురించి పూర్తిగా విను మార్గరేట్.'

'యింకేం వినాలి? అంతా బోర్. సమాజం అంటావు. కులం అంటావు. యివి రెండే కదా నీ వుపన్యాసంలో ముఖ్యంగా వినిపించే మాటలు.'

'నో! అంతేకాదు. మా పూర్వులు కొన్ని ఆంక్షలు విధించేరు. ఆ విధంగానే అన్ని కులాలూ, మతాలూ ఆయా మాత్రాల్ని నమ్ముకుని బ్రతుకుల్ని వెళ్ల



చేస్తున్నారు. ప్రేమకి మా సమాజంలో అంత స్థానం లేదు. కులం కోసం ప్రాణాలు తీసుకుంటారు. కన్నబిడ్డలైనా సరే కుల పట్టింపులు తప్పితే వాళ్లకు వేయవలసిన శిక్ష వేస్తారు.'

'అంటే ?'

'నువ్వు నే చెప్పేది నమ్ముతావా మార్గరేట్.'

'వైనాట్'

'యేమో ఒకవేళ నేను చెప్పేది నాన్సెన్స్ అనేసి కొట్టి పారేస్తే.'

'అందువల్ల నీకేం నష్టం. వినమంటున్నావు. వింటాను. అదేమిటో చెప్పు.'

'మావీధిలో రాధ వుండేది. రాధ అందాల అపరంజి బొమ్మ. రాధ తండ్రి మిలట్రీలో పనిచేసి కాకలుతీరిన మనిషి. కరుడు కట్టిన మానవత్వం అతన్ని కఠిన శిలలా మార్చేసింది: రాధ మాయింటి చివర వుండే ఒక సిక్కు అతన్ని ప్రేమించింది. యిద్దరూ పెళ్లి చేసుకుందాం అనుకున్నారు. విషయం కల్నల్‌గారికి తెలిసింది.'

'అయితే', మార్గరేట్ చాలా శ్రద్ధగా వింటోంది. కల్నల్ విషయం యిదివరకు విన్నా యివాళ ఆసక్తిగావుంది అతని కూతురి గురించి చెబుతుంటే.'

'రాధ తెగించి అతనితో లేచి వెళ్లి పెళ్లి చేసుకోవాలనే గట్టి నిర్ణయానికి వచ్చేసింది. సమాజం అప్పటికి యింకా

# పరిలిప్తం

పురోగమించలేదు. కల్నలే అతను రాసినట్లు ఓ ఉత్తరంరాసి ఆ అమ్మాయికి అందజేశాడు. పరువు—ప్రతిష్ఠలకోసం అతను చేసిన సాహసం యిద్దరికే తెలుసును. వాళ్లిద్దరే అతను పోయేక సంగతి బయట పెట్టేరు. రాధని యెక్కడో అయినవాళ్లకి దూరంగా దిగబెట్టి రాత్రికి రాత్రి వచ్చేశారు. ఈ విషయం అప్పట్లో చిన్నవాడిని కనుక అర్థం అయేది కాదు. యిప్పుడు యీ వయసు వచ్చేక రెండు రెళ్లు నాలుగని గ్రహించేను.'

మార్గరేట్ యేడుస్తూ అన్నది: అయితే నన్ను యిలాగే వదిలేస్తావా?'

'యేం చేయను? నిన్ను నాతో తీసుకు వెళ్లడం సాధ్యం కాని పని'

మార్గరేట్ యేడుస్తూనే అన్నది: 'నీకు మామీద జిమీన్ మా అమెరికన్ల మీద నమ్మకం లేదు. నిన్ను చూశేక నేను యెవర్నీ యెరగను. యెంతో మంది మా యింటికి బోయ్‌ఫ్రెండ్స్ వస్తున్నారు. నీలో వున్న మంచితనం, నిష్కల్మషత్వం అందం వాళ్లల్లో నాకు కనిపించదు. నేను అసలా ప్రయత్నమే చేయలేదు. అఫ్‌కోర్స్. నువ్వు నన్ను నమ్మితే ఈ బ్రతుకంతా నీ కోసం యెదురు చూస్తూంటాను యెక్కడున్నా నువ్వు నావాడివి. నీ సుఖం కోసం నేనిలా వుండిపోగలను.'

సాంబశివం చిన్నగా నవ్వేడు: 'యూ ఆర్ యె ఫూల్. యెక్కడి యిండియా, యెక్కడి అమెరికా. ఈ బ్రతుకులో నిన్ను మళ్లీ కలుసుకుంటాననే అనుకుంటున్నావా మార్గరేట్?'

'యిండియాకి వెడతాను. జయ కనిపిస్తుంది. పెళ్లి చేసుకున్నాక ఆ బాధ్యతలు నన్ను కనీసం నీ గురించి తలుచుకునేందుకైనా అవకాశాన్ని యివ్వవు. నా జయ కనిపిస్తే'... అతను అరమోడ్పు కనులతో కలలు గంటున్నాడు.

మార్గరేట్ దూరంగా జరిగి అతన్ని చేతితో క్రిందికి కుదేస్తూ తనూ చతికిలబడింది: 'ఈ ఒక్క రాత్రి యింటికి వెళ్లకు బోయ్. నాతో గడుపు. జిమిన్, సరదాగా సెకెండ్ షోకి వెడదాం. మా యింట్లో అభ్యంతరం లేదు కనుక తెల్లవారే వరకూ నా గదిలో కబుర్లు చెప్పుకుందాం' విడిపోయేందుకు నువ్వే అంత మురిసిపోతున్నప్పుడు నేనెందుకు బలవంత పెట్టడం. ఈ ఒక్కరాత్రి నాతో వుండు.'

సాంబశివం కనుబొమ్మలు చిట్లించేడు: 'ఎక్స్‌క్యూజ్ మి మార్గరేట్. ఒక్క రాత్రి...అది చాలా కష్టం. నన్ను బలవంతం చేయకు.'

మార్గరేట్ పెదాలని మునిపళ్లతో బిగించి దుఃఖాన్ని గొంతులోంచి కడుపులోకి తోసేస్తోంది; 'నా కోరిక యేదీ తీర్చవు నువ్వు. నాకు తెలుసును. నువ్వు యేడుస్తూ జయా అని పిలిచిన రోజున నేను 'ఊఁ' కొట్టేను. నువ్వు అందించిన చేతిని ఆప్యాయంగా అందుకుని కౌగిలిగట్టుకు చేరుకుంటాననుకున్నాను. కానీ నువ్వో దౌర్భాగ్యుడవి. మోసగాడివి. నీ మాటలకి, చేతలకి యెంతో తేడా వుంది. ఆడపిల్లని అందంగా ఉపయోగించుకునే తెలివితేటలు నీకే వున్నాయి. కానివ్వు. ఆ జయనే చేసుకో. నేను వెడుతున్నాను. నీ సమాజం నీకు జోహార్లు అర్పించనీ. నిన్ను పొగడ్తలతో ముంచెత్తనీ. నేనే కడుపులో దుఃఖాన్ని దాచుకుని నీసుఖం కోరే ఆడదాన్ని. భంగపాటుపడిన యే ఆడపిల్ల అయినా ప్రతీకారం తీసుకునే వరకూ నిద్రపోదు. నేనలాంటిదాన్ని కాదు.

కనబడ్డోళ్లల్లా నోరు తెరిచి అడగాల్నంటే బహుసిగ్గుగా ఉంటాంది బ్రదర్!...





# ఉదయమందలి తాజాదనము గంటల కొలది వుండేలా చేసుకోండి...

మీకిక కావలసినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్! ఉదయం స్నానానంతరం పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను ఒళ్లంతా జల్లుకొంటే తాజాదనము, హాయిని గంటల కొలది వుంచుతుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ యొక్క తేలికైన పరిమళము ఒంటి మీద రోజంతా నిలిచి వుంటుంది. చెమటను త్వరగా పీల్చే గుణము గల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ మండే ఎండలలో, ఉక్కపోసే వాతావరణములో మిమ్మల్ని సేద దేర్చి, తాజాగా, హాయిగా, పరిమళంతో వుంచుతుంది. సంవత్సరమంతా అన్ని వాతావరణములలోను మీరు వాడదగినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్!




## పాండ్స్

డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ —

**ఎంతో మెత్తటి మేలు రకం టాల్క్!**

**చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్**

**(పరిమిత బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)**

# పరిలిప్తం

నువ్వు తప్పకుండా వస్తావు మళ్ళీ యిక్కడికి', మార్గరేట్ ఆయాసంగా చెప్తోంది. అతని భుజాల్ని కుదుపుతూ దూరంగా చూపుడు వేలితో చూపిస్తూ 'అటు చూడు అక్కడే ఆ యింట్లోనే వుంటాను నేను. మార్గరేట్ యెప్పటికీ మారదు సాంబశివం ...'పళ్ళు పటపట లాడిస్తూ అన్నది 'మిస్టర్ సాంబశివం నీకోసం కలవరిస్తూ నువ్వు యెప్పటికైనా వస్తావని నేయికళ్ళతో యెదురుచూస్తూ వుంటాను. ఆఫ్టరాల్ ఒక అమెరికన్ లేడీ లో యెంత? అన్న నువ్వే గుండెలు చిల్లులు పడేలా యేడవ్వాలి. నా సహచర్యం కోసం, పరిష్వంగం కోసం విలవిల్లాడిపోవాలి. ఆ రోజు తప్పకుండా వస్తుంది' అంటూ కదిలి వెళ్ళిపోయింది. అతను నిశ్చేష్టుడై చూస్తూండిపోయేడు మార్గరేట్ వెళ్ళిన వైపుగా.'

తెల్లవారింది. ప్రయాణం దగ్గరపడింది. మార్గరేట్ తల్లీ తండ్రితోసహా యేరోడ్రోమ్‌కి వచ్చింది. యేమీ యెరగనిదానిలా నవ్వుతూ అతని ముంజేతిని అందుకుని ముద్దుపెట్టుకుంది. కళ్ళల్లో కొత్త కాంతుల్ని బిగించుకుంది. చెక్కిళ్ళు రాత్రంతా యేడ్చిన కారణంగా యెరుపు రంగుకు మారిపోయి అతనికి స్పష్టం చేస్తున్నాయి. ఆ పిల్ల దుఃఖం గురించి యే ఒక్కరూ గ్రహించలేరు. అసలా ప్రసక్తే వూహాతీతంగా వుంది.

మార్గరేట్ తల్లి సోనియాలారెన్స్ సాంబశివాన్ని దగ్గరకు తీసుకుని అతని ముంజేతిని అందుకుని తన యింటి గుర్తుగా ఖరీదైన వాచీ పెట్టింది. జానకి మార్గరేట్‌కి ఆప్యాయంగా చేరబిలిచి అన్నది: 'మనం యిండియన్స్, అమెరికన్స్ అనే భేదమేలేకుండా యిన్నాళ్ళూ గడిపేం. స్నేహం అనేది జాతి, మత, దేశాలకే అతీతంగా వుంటుందనుకోలేదు. ఆరేళ్ళు ఆరు క్షణాల్లా గడిచిపోయేయి. మమ్మల్ని మీరు మరిచిపోయినా మిమ్మల్ని మీ మంచితనాన్ని యెప్పుడూ గుర్తుంచుకుంటాం.'

మార్గరేట్ నవ్వింది సుస్మితంగా: 'లేదు ఆంటీ, చాలామంది యిండియన్స్ యిటు వస్తూంటారు. ఆధ్యాసలో మిమ్మల్ని మరిచిపోవడం యిటీజ్ యిమ్పాజిబుల్ టూ యిమాజిన్' మార్గరేట్ తమాషా చేస్తోంది. గుండెలో యెంతోబాధని గోప్యంగా దాచుకుందని గ్రహించింది జానకి. జానకికి కొద్దిగా అనుమానంవున్నా ఆ అనుమానం నిన్నరాత్రి జరిగిన సంభాషణతో పటాపంచలై పోయింది.

స్త్రీ హృదయంలో చెలరేగే తుఫానులు యెటువంటివో పురుషుడు వాటినెంత తేలికగా తీసుకుంటాడో అర్థం చేసుకోగలిగింది. స్పీకర్‌లో ఎనౌన్స్ వినిపించింది. విమానం హాయిగా రెక్కలు చాపుకుంటూ వచ్చి ఆగింది. విమానం యెక్కేక కిటికీ అద్దంలోంచి మార్గరేట్‌ని ఆఖరిసారిగా చూస్తూంటే సాంబశివం కళ్ళలో నీళ్ళు చేరుకున్నాయి. అతను గుటకలువేస్తూ చేతిని అద్దానికి అడ్డంగా వూపేడు కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకుంటూంటే కొడుక్కి దగ్గరగావచ్చి 'టేక్ యిట్ యీజీ మై డియర్‌బోయ్' అన్నాడు గిరిధర్ మార్గరేట్ పిలిచేవాడిరిగానే......

* * *

బీచ్ పూర్తిగా నద్దుమణిగింది. చీకట్లు పూర్తిగా ఆక్రమించుకున్నాయి. అతను జయ మొహంలోకి చూశాడు.

'అయితే మీ అమ్మా నాన్నాకూడా గ్రహించేరన్నమాట'

'అవును యిక్కడికివచ్చేక గుంటూరులో అన్నది అమ్మ'

'నిన్నేమన్నారు?'

సాంబశివం వ్యర్థంగా నవ్వేడు 'మన సమాజం యేమంటుంది నీ వ్యతిరేకంగా? పొగడ్తలకేమీ లోటువుండదు యిక్కడ. అమ్మ నాలాంటి కొడుకుని కన్నందుకు గర్విస్తున్నానన్నది. నాన్నగారు తనపేరు నిలబెట్టినందుకు మహదానంద పడిపోయేనన్నారు. మార్గరేట్‌ది సిన్సియర్‌లౌ కాదన్నీ, వాళ్ళు అందమైన మగపిల్లల్ని చూస్తే అలాగే ప్రవర్తిస్తారనీ రకరకాలుగా అన్నారు అదంతా మామూలే.'

'అయితే నువ్వు మార్గరేట్‌ని అనుమానిస్తున్నావా?'

'నేను కాదు జయా! స్వార్థం అంటే ఆలోచించనిస్తుంది.

మార్గరేట్ గురించి నాకన్నా వాళ్ళకి యెక్కువ తెలీదు. ఆ వయసులో స్వేచ్ఛగా

తిరిగే ఆడపిల్లమీద అందరికీ వుండే అనుమానమే వాళ్ళకీ వుంటుంది. కానీ మార్గరేట్ వుత్తమురాలు:'

సాంబశివం లేచి నిలుచున్నాడు. అతను జయ చేతికి ఆసరా యిచ్చి లేపి నిలుచోబెట్టాడు. 'నువ్వు కనిపిస్తావని తెలుసును. కానీ యింత నాటకం ఆడతావనుకోలేదు.'

జయ అర్థం కాని దానిలా చూసింది.

'నన్ను గుర్తుపట్టి యెందుకలా క్షోభ పెట్టేవు నిజం చెప్పేయ్. కాళిదాసు మీద నాకు పీకలవరకూ కోపం వుండేది. అతనంటే మొదట్లో ప్రాణం యిచ్చేవాడివి యిప్పుడైతే నువ్వు అతనిక మరదలివి అవుతావని తెలిసిందో అప్పటికే అతనిమీద ద్వేషం పెరిగి రెట్టింపయింది. అతని అందం తెలివితేటలూ చూసి నువ్వు మురిసిపోయి నాకు టోకరా యిస్తున్నావనుకున్నాను.'

జయ గలగలా నవ్వింది: 'టోకరా పదం మరిచిపోలేదు నువ్వు యింతవాడివి అయినా. నీకు తెలీదుకానీ కాళిదాసు వుత్తముడు సాంబా.'

'యేం ?' సాంబశివం కనుబొమ్మలు ముడివేసి ప్రశ్నించేడు.

'భారతిని చేసుకుంటున్నాడు కనుక.'

'అలాగా'

'మరో మనిషికూడా వుత్తముడుగానే కనిపిస్తున్నాడు.' జయ నవ్వింది.

'యెవరేమిటి ?'

'చెప్పకూడదు.'

సాంబశివం నడుస్తున్నవాడల్లా ఆగిపోయేడు 'అయితే యింకేం నువ్వు అతనితోనే వుండు,' అతను కావాలనే అన్నాడు.

'నిజం. నిజం. ఈసారి పోగొట్టుకోకూడదు. నేను కాదంటే మించిన అందగత్తె మార్గరేట్ వుంది అతనికి'

సాంబశివం ఘొల్లున నవ్వేడు. జయ శృతి కలిపింది.

* * *

రాజశేఖరం పనిపెట్టుకుని మద్రాసు వచ్చేడు. వచ్చేముందు పిల్లలకి టెలిగ్రాం యిచ్చేడు. కాళిదాసూ, జయా అతన్ని కలుసుకునేందుకు స్టేషనకి వెళ్ళేరు. రాజశేఖరం మద్రాసులో మైలాపూర్‌లో వున్న స్నేహితుడింటికి జయనీ, కాళిదాసునీ కూడా తీసుకు వెళ్ళేడు.

రాజశేఖరం స్నేహితుడు కుప్పుస్వామి. అతను బాంక్‌లో మంచిహోదాలోవున్న పెద్దమనిషి. విషయం విని అతను రాజశేఖరాన్నీ, కాళిదాసునీ అభినందించేడు. పిల్ల తరపున బాధ్యతలు తను తీసుకుని పెళ్ళియేర్పాట్లు చేస్తానని మాటయిచ్చేడు.

రాజశేఖరం అతని భుజంమీద చేయివేసి 'థాంక్స్ కుప్పుస్వామి. నా పరిస్థితుల్ని నువ్వర్థం చేసుకోవాలి' అన్నాడు.

'నువ్వింతగా చెప్పాలా రాజా. యిద్దరం ఒకే స్కూల్లో చదివిన వాళ్ళం. యిప్పుడు నీకు నేను యేమంత సహాయం చేస్తున్నానని థాంక్స్ అంటావు ఖర్చు భరించేశక్తి దేవుడు నాకు యెలాగూ యిచ్చేడు. నాకా బిడ్డా పాపా లేరు. వుండివుంటే వెనుదీసేవాడినని భగవంతుడు అలాచేశాడు. నీ పరువు ప్రతిష్ఠలు నావి అనుకోకపోతే యేదీ చేయలేం?' కుప్పుస్వామి అన్నాడు.

అతను భారతి తల్లితో విషయాలన్నీ మాట్లాడేడు. పదిహేనురోజుల్లో పెళ్ళి జరిగే యేర్పాట్లు చేశాడు. రాజశేఖరం సంఘంలో పుష్కలంగా పరువున్న మనిషి. అతని కీర్తి ప్రతిష్ఠలు క్రమక్రమంగా మద్రాసులో పేరున్న ప్రతివ్యక్తి చెవులకి సోకుతూనే వున్నది. కుప్పుస్వామి స్నేహితుడి కోసం నడుం బిగించేడు. అతనిభార్య దినమణికూడా అతనికి యే విషయంలోనూ వ్యతిరేకం చూపించలేదు.

పదిహేనురోజులు పదిహేను సెకెండ్ల మాదిరి గడిచిపోయేయి. రెండు వైపుల ఖర్చునీ భరించి భారీయెత్తున నలుగురూ నాలుగు కాలాలపాటు చెప్పుకునేవిధంగా



భూనభోంతరాలు దద్దరిల్లేట్టు అతి ఆడంబరంగా రంగ రంగ వైభవంగా పెళ్ళి చేశాడు రాజశేఖరం.

పెళ్ళిలో సాంబశివాన్ని అతను క్రీగంట గమనించినా మౌనంగా వూరుకున్నాడు. సమయంవస్తే యేదీ ఆగదనే విషయం అతనికి తెలుసు.

కాళిదాసు మేనత్త మేనమామలకి వొంగి నమస్కారంచేస్తూ 'నీ ఋణం' అన్నాడు. అతనికళ్ళలో అప్పటికే ఆనందాశ్రువులు చేరుకున్నాయి.

రాజశేఖరం అతని భుజంతట్టి: 'ఋణాలూ కృతజ్ఞతలూ నాన్సెన్స్ నువ్వు తెగించి చేసుకునేవాడివి నేనే కాదంటే. ఆ విధంగా నలుగురిదృష్టికీ నేను అనడం నాకు యిష్టంలేదు. యింత డబ్బున్నవాడిని ఆకీర్తి ప్రతిష్ఠల్ని నేనే సంపాదించుకోవాలనే స్వార్థంలో చేశేసి పెళ్ళి' అని 'వివాహ విద్యానాశనం' అన్నారు మనవాళ్ళు. చదువుకి యోగనామం పెట్టకండి', అన్నాడు. మనోరమా భర్తా ఆ సాయంత్రమే సఖినేటిపల్లి వెళ్ళిపోయేరు.

రమ దూరంగా గార్డెన్‌లో కూర్చుని వుండి వుండి కళ్ళు తుడుచుకుంటోంది. ఆవిడకి యెదురుగా ఆరడుగుల విగ్రహం, నిలబడివుంది. రాజశేఖరం ఒకటికి రెండు సార్లు కళ్ళు చిట్లించి ఆమె వైపు చూశేడు. సందేహం లేదు. అతను సాంబశివం. అతను దీర్ఘంగా నిట్టూర్పు వదిలి పేపర్లో తల దూర్చేడు.

రమ అతన్ని చూసి అంది: 'నిన్ను చూడగానే గుర్తుపట్టేను. నీకు తప్ప మరెవరికీ వుంటుంది నుదుటిమీద అంత పెద్ద గాటు. చిన్నప్పుడు బంతిలా వున్న నిన్ను యెత్తుకుని మేడ మెట్ల చివర నిలుచున్నాను. అప్పుడే మీ అమ్మ మామిడికాయలు తరిగి కత్తిపీట యేటవాలుగా వుంచింది. నువ్వు మామిడిపండు కోసం గిలగిల్లాడుతున్నావు. నేను జయని కడుపుతోవున్నాను. నిన్ను ఆపలేకపోయేను. కత్తిపీట మొహంమీద గుచ్చుకుంది. యెంత రక్తం...యెంత రక్తం ? అప్పుడు జయ తండ్రే నీ మొహంమీద జాగ్రత్తగా కుట్టేరు. అయినా ఆ మచ్చ పోలేదు.

# పరిలిప్తం

అత్తని నేను జ్ఞాపకం రావడం లేదూ సాంబూ.'

'యెందుకు రావడంలేదత్తా. జయని మా శాను కాలేజీలో. కాళిదాసు పరిచయం చేశాడు ఆ తరువాత. మిమ్మల్ని గురించి అడిగేను నేను.'

'అమ్మా నాన్నా కులాసాయే కదూ.'

'ఆఁ అంతా బాగున్నారత్తా. నాన్న గారికే కాన్సర్. ఆయన యీ మధ్య మంచంమీదనుంచి లేవడంలేదు.'

'అలాగా. మేము కాకినాడలో వున్నాం అని మీ అమ్మకీ వాళ్లకీ చెప్పేనా.'

'చెప్పేనత్తా', సాంబశివం ఆ పైన స్వంత విషయాలు మాట్లాడేందుకు రమకి అవకాశం యివ్వలేదు. అమెరికా వెళ్లడం, ఆరేళ్లు అక్కడే వుండడం, అక్కడి మనుష్యుల గురించీ వాళ్ల ఆచారాల గురించీ కబుర్లు దొర్లించి చివరకి లేచి నిలుచున్నాడు.

'మా జయ ఒక యింటిదైతే నాకే బెంగా వుండదు.' అన్నది ఆఖరిగా.

'మీ జయకేం అత్తా. అందం, గుణం, డబ్బూ అన్నీ వున్నాయి. మావయ్య చిటికె వేసి వరుణ్ణి తేగలడు', అంటూ సెలవు తీసుకున్నాడు.

స్టేషన్లో కాళిదాసుని చేర బిలిచి అందరూ వుండగా రాజశేఖరం అన్నాడు: 'యింక యిప్పుడు హాస్టల్స్ మీ అందరికీ అనవసరం. నేను డబ్బు పంపిస్తాను. మావూళ్లో భారతీ కాపరం పెట్టి మీ దగ్గర జయని వుంచుకోండి. చూడు తల్లీ! జయ అభం శుభం తెలీని పిల్ల. దాన్ని యెలా చూసుకుంటావో'

భారతి జయ భుజం చుట్టూ చేతులు వేసి నిలుచుంది. 'మీ యిష్టప్రకారమే విడిగా వుంటాం బాబాయిగారూ. జయని గురించి మీకు బెంగ అక్కర్లేదు,' అన్నది మనస్ఫూర్తిగా. జయని విడిచి వెడుతూంటే యిన్నాళ్లకి అతనికే బాధగా వుంది. అందరు పిల్లలూ యెంచుకునో, ఘడియ రాగానో పెళ్లిళ్లు చేసుకుని ఒకింటి వాళ్లు అవుతూంటే తన బిడ్డకి యింత అందచందం, ధనం వుండి ప్రయోజనం లేనట్టుగా తోచింది. రైలు యెక్కి కిటికీలోంచి జయ తలమీద చెయివేసి 'నీ జీవితానికి యెప్పుడో' అన్నాడు అస్పష్టంగా.

జయ తలెత్తి అతని వైపు చూసింది. ఫ్లాట్‌ఫామ్ కిటకిటలాడుతోంది జనంతో. వచ్చే రైళ్లు పోయే రైళ్లతో చాలా సందడిగా వుంది. రాజశేఖరానికి చాలా మంది వీడ్కోలు యిచ్చేందుకు వచ్చేరు. సాంబశివాన్ని ఆయన పోల్చుకున్నాడు. కానీ గుర్తుపట్టనట్టూ అంటీ ముట్టనట్టూ ప్రవర్తించేడు. జయకి ఆశ్చర్యంగానే అనిపించింది. తన తండ్రి అందరి తండ్రుల వంటి వాడు కాదు. పేదరికాన్ని అర్థం చేసుకోగలడు? మనిషి మనసెరిగి మసులు కోగలడు. కానీ... యిది... యీ సంగతే చాలా చిత్రంగా తోచింది. సాంబశివం పేదవాడు కాదే? మరి?

కూతవేసిన రైలు యెంతో సేపు ఆగలేదు. తల్లీ తండ్రీ దూరం అవుతుంటే జయ కళ్లు తుడుచుకుంది: 'నువ్వు యేడుస్తున్నావా జయా! అమ్మని నాన్నని వదల్లేని పాపాయివి యిప్పుడైపోయే వేమిటి,' అన్నాడు కాళిదాసు దగ్గరగా వచ్చి.

భారతి స్నేహపూర్వకంగా జయ చేతిని అందుకుని ఫ్లాట్‌ఫామ్ బయటికి వచ్చింది.

కుప్పుస్వామి సహాయంతో త్వరలోనే అన్ని సౌకర్యాలూ వున్న చిన్న యింటిని సంపాదించగలిగేడు కాళిదాసు. ఆ యింట్లో జయకీ, భారతికీ వేరువేరు గదులున్నాయి. ఇద్దరూ కలిసి పనులు కానిచ్చుకుని కాళిదాసుని భోజనానికి పిలుస్తారు. ముగ్గురూ భోజనాలు పూర్తి చేశాక యెవరిదారిన వాళ్లు కాలేజీలకి వెళ్లిపోతారు. జయా, భారతే కాకుండా ఒక్కోరోజు కాళిదాసు యింటికి ముందు చేరుకున్నా 'కాఫీ' కాచి మిగతా యిద్దరికీ ఫ్లాస్కులోపోసి వుంచి కంటో తల దువ్వు తాడు అతను. సాయంత్రం అయిదు దాటాక ముగ్గురూ కలిసి బీచ్ వైపో, పార్థసారధి కోవెలవైపో షికారు బయలుదేరుతారు. ఆదివారం వచ్చిందంటే ముగ్గురికీ స్నేహితులే. ఇల్లు స్నేహితుల నవ్వులతో, ఆటపాటలతో మారోగ్మిపోతూంటుంది. నెలలో మొదటి రెండువారాలూ ఇంగ్లీషు పిక్చరు చూస్తే, చివరి రెండువారాలూ తెలుగు మార్నింగ్ షో చూస్తారు. అంత కంతకు కాళిదాసుకీ, సాంబశివానికీ చెలిమి బలపడింది.

ఫైనలియరు పరీక్షలు కాళిదాసూ, సాంబశివం వ్రాసేరు. ఇద్దరూ కష్టపడి చదివినందుకు ఫలితాల గురించి ఎక్కువ బెంగ పెట్టుకునే అవసరం లేకపోయింది. జయా, భారతీ మూడోసంవత్సరం పరీక్షలు వ్రాశేరు.

జయ ఒంటరిగావున్న సమయంలో అడిగేడు సాంబశివం: 'చాలా రోజులుగా అడగా లనుకుంటున్నాను జయా. నీకే యింట రెప్పలేనా, నన్ను చేసుకోవాలనే తలపే నీ మనసులో లేదా.'

'ఇప్పుడేం తొందర సాంబా. నువ్వెలాగూ గట్టెక్కేస్తున్నావు. హౌస్ సర్జన్సీ పూర్తి అయేక ప్రాక్టీసు పెట్టు. అప్పటికి నేను కూడా ఫైనలియరు పరీక్షలు వ్రాస్తాను. నామాటకి మా యింట్లో తిరుగులేదు. నిన్ను చేసుకోకపోతే అసలీ జీవితానికే పెళ్లిలేదు.'

'ఏమో' అతను దీర్ఘంగా నిట్టూర్చేడు: 'యింకా రెండేళ్లమాట మాట్లాడుతున్నావు. ముందు పెళ్లిచేసేసు కుంటే అంత బాధ వుండదు. ఇప్పుడు నీకు కలిగే నష్టం యేమిటి?'

'భలేవాడివే. నష్టం అంటూ యేమీ లేదు. తీరా పెళ్లంటూ అయేక చదువు మీద నెగ్లెక్టు చేస్తే... అంతవరకూ దేనికి సాంబా రెండేళ్లు యెంతలో దొర్లిపోతాయి.'

సాంబశివం ఆ పైన మాట్లాడలేదు.

స్వంతకాపురం అంటూ యేర్పడ్డాక కాళిదాసుమీద చాలా బాధ్యతలు చేరుకున్నాయి. జయ సాయంకాలం కొంచెం ఆలస్యంగా రావడం జరుగుతే నిలదీసి అడగాలని అంతరాత్మ బోధిస్తోంది. ఒక వేళ అలా జరగకపోయినా అతన్ని భారతి మేలుకొలుపుతుంది. 'మీరు నిర్లక్ష్యంగా వుండడం అంత మంచిదికాదు. జయని బాబాయి మనచేతుల్లో వుంచేరు. కాలేజీ వదలగానే రావడంలేదు. కారణం తెలుసు కోవలసిన బాధ్యత మనమీద వుంది.'

(ఇంకా ఉంది)

# వారఫలం

## 5-9-1969 శుక్రవారం మొదలు 11-9-1969 గురువారం వరకు

**మేషం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**వృషభం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిధునం:** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు.

స్త్రీలకు— అధికవ్యయం జరుగుతుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

**సింహం** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ప్రయాణాలోచనలు చేస్తారు. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది వారం ఆఖరులో అధిక వ్యయం జరుగుతుంది. వృత్తిలో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల:** అన్నివ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలిస్తుంది.

**వృశ్చికం:** లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు:** ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. వారం మధ్యలో మీరు ప్రయోజనంలేని శ్రమకు గురికాగలరు. సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగా ఉంటాయి.

**మకరం:** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో వృత్తిలో ప్రయాస కలుగుతుంది. ఆందోళనకు గురి కాగలరు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కుంభం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన విషయాలన్నీ తెల్సుకొంటారు. ప్రయాణాలు బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**మీనం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన కృషి చేయవలసి వస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సాటివారితో వాదప్రతివాదాలు తగవు.

—మహేష్ ●






క్లబ్బులోని గడియారం జబ్బుమనిషిలా అంగుళంగుళం దగ్గుతూంది. పుస్తకంలో యిరుక్కున్న తలనెత్తి కళ్లద్దాల్లోంచి గడియారం అద్దంలోకి ఓ చూపు విసిరేడు క్లబ్బు సభ్యుడు సీతాపతి. అది తిరిగొచ్చి అతడికే తగిలింది.

'అబ్బా! అప్పుడే ఎనిమిదైందే!' అనుకున్నాడు. అనుకుని తల తీసికెళ్లి పుస్తకంలో పెట్టేడు. కథలు చదువుతూ బొమ్మలు నంజుకుంటూ 'తంగభస్మం. వంగనస్యం' అడ్వర్టైజుమెంటు వరకూ వచ్చేడు.

'బాబూ హ్హి హ్హి'

ఈ బాబూ హ్హి హ్హి గొంతు సీతాపతికి అతిబాగా తెలును. సీతాపతికి అంతబాగా తెలిసిన ఆ గొంతు అక్లబ్‌ప్యూన్ వెంకటయ్యది.

సీతాపతి పుస్తకం టేబుల్‌మీద పడేసి 'ఏమిటి వెంకటయ్యా' అన్నట్లు నవ్వేడు. ఏమాటకామాటె చెప్పుకోవాలి సీతాపతి రోజుకు రెండుసార్లు నవ్వుతాడు—వాళ్ల వీధిచివర పోస్ట్‌మాన్ కన్పించి 'మీకేం వుత్తరాలు లేవు'అన్నప్పుడోసారి, క్లబ్బులో వెంకటయ్య పలకరించినప్పుడోసారీను.

వెంకటయ్య ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ చేతులు తెగ నలిపేసుకుంటున్నాడు గాని నోరువిప్పి చెప్పదలచుకుంది చెప్పలేక పోతున్నాడు.

వాడవస్థ గమనించిన గుమాస్తా గుర్నాథం లేచి నవ్వుతూ 'మరీ అంత గట్టిగా నలుపుకోకోయ్ చేతులు, అరిగి పోగలవ్' అని సీతాపతి కేసి తిరిగి.

చూడండి సీతాపతిగారూ యివాళ మన వెంకటాయ్‌కి శోభనంట మీరు కాస్త త్వరగా విడుదలచేస్తే వాడు కాస్త త్వరగా పెళ్లానికి బందీనవుదామని సంబరపడి పోతున్నాడు' అన్నాడు.

సీతాపతి ఆశ్చర్యాన్నెక్కిపోతూ, ఆగి 'వెంకటాయ్‌ని నేను విడుదల చేయట మేమిటీ' అంటూ మొహమాటంగా నవ్వేడు. (ఇవాళ సీతాపతి రోజుకంటె ఒకసారి ఎక్కువగా నవ్వేడన్న మాట!)

'మరి తమరు పదిగంటలవరకు క్లబ్బు వొదలరుగా మహానుభావా! అంతవరకూ వాడు యిక్కడేవుంటే...పూర్‌ఫెలో పెట్టుకున్న ముహూర్తానికి కట్టుకున్నదాని ముందెలా వుండగలడు?'

ఈమాట అన్నాకైనా గుర్నాథం వూరుకోవచ్చునా! వూరుకోలేదు గురగురా నవ్వేడు. అతణ్ణిచూసి అక్కడున్న యిద్దరు కొత్తసభ్యులుకూడా నవ్వేరు. దాంతో సీతాపతికి తలకొట్టేసి మళ్లీ అతికించి నట్లైంది. కాస్త కోపంగానే ముక్కు తెగరేశాడు. కాని ముఖానికి ఆకర్షణశక్తి వుందేమో—మళ్లీవచ్చి అతుక్కున్నె అతుక్కున్న ముక్కులోంచి సెగలుపొగలు వచ్చేసినై.

గుర్నాథం అదేం పట్టించుకోకుండా మిగతా యిద్దరితో బయటకెళ్లి పోయేడు. అతడు కొత్తసభ్యులో మాట్లాడుతున్న మాటలుమాత్రం లోపలికొచ్చి సీతాపతి చెవులో దూరినై.

'బ్రదర్స్! ఈ సీతాపతి అనబడేవాడు జానకమ్మ మొగుడు కాకముందు ఎట్టి మాన్యాలూలేని పతిసామాన్యుడు. వీడికి 'ఓ' అన్పెప్పిన గురువులున్నారుగాని 'నా' అన్న బంధువు లెవరూలేరు. అంచేతనే అతడు పెళ్లి చేసుకునేప్పుడు తన ఫ్రెండ్స్‌కిచ్చే శుభలేఖల్లోకూడా చి॥ సీతాపతికి చి॥ ల॥ సౌ జానకినిచ్చి వి వా హం ... ఏర్పాట్ల వేయించుకోలేక చి॥ ల॥ సౌ జానకిని చి॥ సీతాపతికిచ్చి...అని అచ్చొత్తించుకున్నాడు.

మొత్తానికి యిల్లులేనివాడు పెళ్లాం యింటి వాడయేడు. అయిన దగ్గరున్నండి ఆవిడ చెప్పుచేతల్లోనే వుండటం నేర్చుకున్నాడు. ఆమధ్య యితగాడి ఫ్లాట్‌ఫారం హవాయిచెప్పులు తెగిపోతే వాళ్లావిడవి పాత చెప్పులుంటే అవేసుకుని బజారొచ్చేడు!

వీడింత ఒదిగివున్నా ఆపెళ్లాం నరశింహం నోటిని చేటగా చేసుకుని వీడిమీద నిప్పులు చెరుగుతూనే వుంటుంది. మనం రోజూ ఫైళ్లు దులుపుతామే అలా సీతా

పతిని తనకంటె పడవ్వుడల్లా జులిపిస్తుంది ఆవిడ!

అది తప్పించుకుందుకే ప్రొద్దున్నే తొమ్మిదినుండి అయిదు గంటలవరకు ఆఫీసులో, అయిదునుండి పదివరకు యీ కక్కుర్తి క్లబ్బులో తలదాచుకుంటాడు పాపం!'

గుర్నాథం మాటలు విన్నాక సీతాపతి 'ఆ దీనుడు ఎవడో కదా' అని పుట్టెడు దుఃఖపడ్డాడు. ఉత్తరక్షణంలో ఆ దీనుడు తనేనని తెలియగానే (బోల్డు) కోపగ్రస్తుడయేడు.

అయితే సీతాపతికి కోపమొచ్చినప్పుడల్లా ఏడ్పు కూడా పిలువని పేరంటానికి వచ్చేస్తుంది. ఇప్పుడూ వచ్చింది. ముందు ఏడుపు మింగి తర్వాత కోపం కక్కుదామనుకునేంతలో...

'బాబూ...హ్హి హ్హి.'

సీతాపతి తలెత్తేడు బల్లమీద వున్న పుస్తకాలన్నీ బీరువాల్లోకి వెళ్లిపోయినై. ఉన్న నాలుగు కిటికీలు మూసుకునై. క్లబ్బుకున్న అయిదు లైట్లల్లో నాలుగు నిద్రోతున్నాయ్. అయిదోదాన్ని నిద్రపుచ్చే ప్రయత్నంలో వెంకటాయ్ 'స్విచ్' మీద చేయివేసి 'బాబూ హ్హి హ్హి' అన్నాడు.

సీతాపతి గతుక్కుమన్నాడు. 'హన్నా! చెట్టంత మనిషి, క్లబ్బు మెంబరూ తనుండగా, తనతో మాట మాత్రమైనా అనకుండా అన్నీ మూసేసి బయటకుపోతావా లేపోతే తాళంవేసి పొమ్మంటావా అన్నట్టు నిలబడ్డాడా—మియర్ ఫ్యూన్ వెంకటాయ్!' ఎంత గడుసుతనం! కొంపదీసి వీడిక్కూడా తను లోకువైపోలేదుగాదా?'

ఈ ఆలోచన సీతాపతి గుండెను కాసేపు కదలకుండా పట్టుకుని మరి కాసేపట్లో బలంగా కిందికి గుంజింది. అతడికి వెంకటాయ్‌మీద కోపం వచ్చింది. వెంటనే దుఃఖంకూడా వచ్చింది. అవి రెండు ఆవిరైపోతున్న సమయంలో ఒక మంచి 'అయిడియా' వచ్చి ఉత్సాహంగా లేచేడు.

'అద్యరేగాని వెంకటాయ్ టైమెంతైందంటావ్...అరె ఏనిమిదన్నరా! ఇవాళ ఆరుగంటలకల్లా యింటి కొచ్చేయండి ముందు వెన్నెల్లో షికారుచేసి రెండో ఆట సినిమాకు వెళ్దాం అందోయ్ మా ఆవిడ...నేను ఆ సంగతే మర్చిపోయి యీ వెధవపుస్తకాల్లో మునిగిపోయాను...ఛీఛీ...అన్నట్టు లీలామహల్లో యేం పిక్చరాడుతూంది?... ఆ...నీకేం తెలుస్తుందిలే ... తెలిసినా 'ఫురానా దొంగలరాణి' అనో మరో తెలుగు పేరో తెలుస్తుంది...నేనే వెళ్లి కనుక్కుంటాన్లే...అవునూ. నీకు యివాళ శోభనమా... ఓరి ఓరి...ఎంత సిగ్గుపడిపోతున్నావురా...యింద యీ అర్ధరూపాయి వుంచుకో ... యింటికేమన్నా పట్టుకెళ్లొచ్చు...సరే నే వెళ్తాను...తలుపులు జాగ్రత్తగా వేసుకుంటావుగా...'

ఎన్నడూ నోరు మెదపని మనిషి పప్పు వెనిపినట్టు టకటక మాటాడేస్తుంటే వెంకటాయ్‌కి ఆశ్చర్యమేసింది. కాని అర్ధరూపాయ పుచ్చుకున్న సంబరంలో ఆశ్చర్యాన్ని మర్చిపోయేడు.

సీతాపతి 'వెంకటాయ్ మనబుట్టలో పడ్డాడ్రా బాబూ' అనుకుంటూ మూడడుగులు ముందుకెళ్లి ఒకడుగు వెనక్కి వచ్చాడు.

'చూడు వెంకటాయ్ రేపు నేనురాను... మా ఆవిడను తీసుకుని మరోసినిమా కెళ్దామనుకుంటున్నాను. నాకోసం ఎవరన్నా వస్తే ఎల్లుండి రమ్మను!'

'అలాగే బాబూ'

సీతాపతికి వెంకటాయ్ ముందు పలచనైపోలేదన్న ఆనందం వుందిగాని రేపు క్లబుకి రాకపోతే 'అయిదు గంటలనుండి పది గంటలవరకు ఎక్కడ గడపాల్రా భగవంతుడా' అన్న ఆలోచన అధికంగా వుంది. 'రేపటిదాకా యెందుకు ఇంకా తొమ్మిదవ్వా గాలేదు...ఇప్పుడేపోయి పదకొండింటిదాకా రెండుగంటల చివాట్లు తింటావో, లేకపోతే పదింటికి ఇంటికెళ్లి ఒకగంటతో సరిపెట్టుకుంటావో తేల్చుకో' అంటున్నాడు సీతాపతిలోని సీతాపతి.

సీతాపతి మవునంగా నడుస్తున్నాడు.

'ఏమండీ యీవూళ్లో మంచి మీల్స్ హోటలెక్కడుంది?'

అడిగింది తననేనని తేల్చుకుని అడిగినది యెవరో అని పక్కకి తిరిగేడు సీతాపతి.

అడిగినమనిషి చూసి అడక్కుండానే మూర్ఛబోయినంత పన్చేశాడు. తేరుకుని ఎదుటివ్యక్తిని క్లోజప్‌లో కాసేపు, లాంగ్ షాట్‌లో కాసేపు, మిడ్‌లాంగ్ షాట్‌లో కాసేపు చూసి చూసి చూసి, గోదాలోకి దూకుతున్నట్టు దూకి అతగాణ్ణి వాటేసుకుని 'నువ్వుట్రా కాశీపతీ' అనరిచేడు సీతాపతి ఆనందతవతిలో మునిగి తేలుతూ.

సీతాపతి ఎన్ని యాంగిల్స్‌లో చూశాడో అన్ని యాంగిల్స్‌లో సీతాపతిని చూసిన కాశీపతి సంతోషంతో సీతాపతిని గట్టిగా వాటేసుకుందామనుకున్నాడుగాని ... ఆపని సీతాపతి చేయటంతో 'నువ్వుట్రా సీతాపతీ!' అంటూ అతడివీపు నిమరసాగేడు.

వీళ్లిద్దరూ యిన్ని యాంగిల్స్‌లో చూసుకుని, ఆలోచించుకుని అంతగట్టిగా కౌగలించుకోవటం చూసి అదేదో సినిమా షూటింగని ఒక్కొక్కరే జనం వాళ్ల చుట్టూ చేరటం మొదలెట్టారు. అమ్మాసి కాశీపతి, సీతాపతి విడివడి జనంతో కలిసిపోయి నడక సాగించారు.

'అయితే యిప్పుడేం చేస్తున్నావురా కాశీపతీ'

'దేశసేవ...నువ్వో?'

'పత్నిసేవ' అందామనుకుని మానేసి తనే ఆఫీసులో యేంచేస్తున్నది చెప్పాడు సీతాపతి.

ఇద్దరూ అలా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. మధ్యనలో కాశీపతి 'యేం వూరాయిది మంచి భోజనహోటల్ ఒక్కటన్నాలేదు' అన్నాడు.

'..............'

'ఒరేయ్ బాబూ! నేనింకా నాల్రోజులుండాలి యీవూళ్లో ... కాస్త మంచి హోటలుంటే యేవన్నా సజెస్టు చేయరా బాబూ...సరైన తిండిదొరక్క ఛస్తున్నా!'

బజార్లో కరంటుపోయింది. సీతాపతి ముఖంలో కళ అంతకుముందే జారుకుంది.

ఇన్నేళ్ల తర్వాత కన్పించిన మిత్రుడితో ఇంతసేపట్నుండి మాట్లాడుతూ ఇంటికి ఆహ్వానించలేకపోయానే అని గుండెల్లోనే ఏడ్చుకున్నాడు.

వెంటనే ఆవేశంగా ఒరేయ్! హోటల్ గీటల్ అన్నావంటే వీపుకాగితంలా చించేస్తాను జాగ్రత్త. సామానెక్కడుంతో పుచ్చుకుని ఇంటికి నడు' అందామనుకున్నాడు. కాని నోటివరకు వచ్చిన ఆ మాటల్ని అప్పుడే జ్ఞాపకానికొచ్చిన అతడి ధర్మపత్ని జానకమ్మ మింగేసింది.

'స్వతంత్రించి వీడిని విందుకు పిలుచుకెళ్తే అది (జానకమ్మ) యేమంటుందో?

పుత్తు పెంకెపుటం అన్నం పెట్టనన్నదంటే పెట్టదంతే! అప్పుడు తను అభాసుపాలు కావలసి వస్తుంది. పోనీ వీడికి హోటల్లో తనే భోజనం పెట్టిస్తే...?' సీతాపతి జేబులో చేయి పెట్టి చూసుకున్నాడు వేళ్లకు ఓ పావలా బిళ్ల ఓ పది పైసల బిళ్లా తగిలినై. పావలాకాసు చెల్లేది కాదు!! ఇక పదిపైసలకు ప్లేటు భోజనంకూడా రాదు. ఇప్పుడెలా? ఆలోచనగా పెదవి కొరుక్కుంటూ పక్కకి చూశాడు. పెద్దహోటల్‌ముందు 'భోజనం తయార్' అన్న చిన్న బోర్డువుంది. ఉన్నట్టుండి ఆబోర్డు 'పదిపైసలకే పంచభక్ష్య పరమాన్నాలు తయార్' అన్న బోర్డుగా మారిపోతే ఎంత బావుంటుందో అనుకున్నాడు. తర్వాత నవ్వుకున్నాడు.

'ఏమిట్రా నీలో నువ్వే నవ్వుకుంటున్నావ్!'

'ఏమిటా. ఇన్నేళ్లకు కనపడి మంచి హోటలేదన్నా వుందేమో చెప్పమంటుంటేనూ...మరేమీ మాట్లాడకురా ఫూల్. నోర్మూసుకుని ఇంటికిరా' నాటకంలో కొత్తనటుడు డైలాగులు చెప్పినట్లు చెప్పేడు సీతాపతి. ధైర్యంగా వుండాలనుకున్నాడు గాని ఓ పక్క భయంగానేవుంది.

కాశీపతి నవ్వి వూరుకున్నాడు.

ఇద్దరూ తక్కువ మాట్లాడుకుంటూ ఎక్కువ నవ్వుకుంటూ యిల్లు చేరుకునే సరికి సీతాపతి సతి జానకమ్మ సన్నికల్లులో కారాలు మిరియాలు వేసి నూరుతోంది. సీతాపతి రెండోమనిషిని వెంటబెట్టుకు రావటంచూసి సన్నికల్లులో మరికొన్ని కారాలు మిరియాలు వేసింది.

సీతాపతి కాశీపతిని వరండాలో కూచోబెట్టి సింహానికి ఆహారంగావెళ్లే కుందేలులా బితుకు బితుకు మంటూ వెళ్లి జానకమ్మ పక్కన నిలబడ్డాడు. ఎంతసేపటికి పెదాలు తడుపుకోవటం తప్పితే యేమీ మాట్లాడలేక పోయాడు.

చూసీ చూసీ జానకమ్మ 'ఏం' అని ఉరిమింది.

'ఏమీలేదు. కాశీ...పతి...అని నా చిన్నప్పటి...స్నేహితుడొచ్చాడు...ఇవాళైనా...నువ్వు ... కాస్త ...రోజాలా కాకుండా...' మిగతామాటలు నోట్లోనే అనుకున్నాడు.

'రోజాలా కాకుండా అంటే ... రోజా

# ముగింపు

నేను రాక్షసిలా ప్రవర్తిస్తున్నానా ?? మీ చేత అంట్లు కడిగిస్తున్నానా యిల్లు తుడిపిస్తున్నానా! ఏం చేస్తున్నానని పిరా మాట మాట్లాడుతున్నారు ?'

జానకమ్మ నిలదీసింది గాని సీతాపతి భయంతో వంగిపోయేడు, తన భార్యగొంతు కాశీపతి ఎక్కడ వినిపోతాడోనని వణికిపోయాడు.

'రోజా నువ్ రాక్షసిలా కాదే రాక్షసి అమ్మలా ప్రవర్తిస్తున్నావ్' అన్నాడు సీతాపతి లోపలి సీతాపతి. తనన్నది గాకుండా జానకమ్మ యెదురుగా నీళ్లు నములుతున్న సీతాపతినికూడా అనమన్నాడు.

సీతాపతికూడా అందామనుకున్నాడు గాని అలా అంటే అసలు విషయమే విషమిస్తుందని ధైర్యంచేసి జానకమ్మ చెంగు పట్టుకుని 'లేదు జానకీ నువ్ నన్ను దేవుడిలా చూసుకుంటున్నావ్' అనేశాడు.

'ప్రతి నిత్యం దేవుళ్లు పూజిస్తుంటే యివాళొచ్చి నన్ను రోజులా చూడొద్దంటారా...అంటే ... యివాళ మిమ్మల్ని దెయ్యంలా తగిలెయ్యనా ?'

సీతాపతికి మతిపోయినట్లైంది జానకమ్మేమో చేతికితీస్తే కాలికి, కాలికితీస్తే తలకు మొత్తానికి తన పరువుకి వుచ్చులు వేస్తోంది. ఇక తను యేం మాట్లాడినా పోట్లాటే జరుగొచ్చని...కాళ్ల బేరానికి దిగేడు.

'జానకీ! నేన్నీకు సమాధానం చెప్పలేను—నా మాట నెగ్గించుకోనూ లేను. అందుకే ప్రార్థిస్తున్నాను ... రెండు చేతులూ జోడించి ప్రార్థిస్తున్నాను ... అవతల అతిథి వున్నాడు కాస్త గొంతు తగ్గించు!'

జానకమ్మ గుడ్లెర్ర జేసింది. యేదో అనబోయినదల్లా సీతాపతి షర్టుకేసి చూసి ఆగింది. సీతాపతి జానకమ్మ చూస్తున్న చోట కళ్లు నిలిపేడు. చొక్కాకు చిన్న చిరుగు పట్టి వుంది! సీతాపతి గాభరాగా చిరుగును చేత్తో కప్పబోయేడు.

కాని జానకమ్మ చేత్తో చిరుగును పట్టుకుంది—మాటల్తో సీతాపతి గొంతు పట్టుకుంది.

'అయ్యొయ్య అయ్యో—కొత్త చొక్కా... నిన్నగాక మొన్న కొన్న చొక్కా...అప్పుడే చిరుగుపట్టించారా...అయ్యయ్యో...చ్'

'అదికాదు ... ఆఫీసు కుర్చీలో ... మేకులూ...'

'మేకులుంటే చూసి కూచోవాలని తెలీదూ! ఎలాపడితే అలా కూచోటమూ చొక్కాలన్నీ చింపుకురావటమూను. ఇహ యీ చిరుగు చొక్కా తమకి పనికిరాదు. రఫ్ తీసిన చొక్కా వేసుకుందుకు నామోషీ! ఛీఛీ...మధ్యన నేను ఛస్తున్నాను వారానికో కొత్తజత కొన్లేక!'

'నువేం కొనక్కర్లేదులే జానకీ ... ఇదుగో... యీ షర్టుకి నీ యిష్టం వచ్చినన్ని 'రఫ్'లు తీయించవూ మళ్లీ ఒచ్చే వేసవిదాకా తొడుక్కుంటాను.'

సీతాపతి షర్టు విప్పి జానకమ్మకందించేడు. జానకమ్మ షర్టును మహా విసురుగా లాక్కుంది ఆ లాక్కోటంలో ఆమె చేతుల్లో నలిగిన షర్టుజేబు 'గరగరా' విలపించింది! జానకమ్మ అనుమానంగా జేబులో చేయి పెట్టింది. చేతివేళ్లు జేబు నలుమూలలా వెతికి ఓ రాణీ మార్కు వక్కపొడి పొట్లాన్ని బంధించి తెచ్చినై.

జానకమ్మ సీతాపతి కేసి గద్దింపు చూపు చూసింది—'ఏమిటిది?' అన్నట్టు.

సీతాపతి ఓటడిగేందుకొచ్చిన మాజీ మంత్రిలా తలొంచుకున్నాడు.

'పూ హూ! వక్కపొడి పొట్లం కొన్నారా! ఇంత చిన్నది కొనుక్కున్నారేం పాపం!...సిగ్గులేక పోతేసరి! సంపాదించేది చొక్కాలు రఫ్ తీయించుకుందుకు జాలదు గాని వక్కపొడి పొట్లాలు మాత్రం జేబుల్నిండా కావాలి!...'

సీతాపతికి కోపమొచ్చేస్తోంది. అంచేత ఏడ్పు కూడా వచ్చేస్తోంది. రెంటిని కలిపి దిగమింగుతూ వెళ్లి జానకమ్మ చేతులు పట్టుకున్నాడు.

'నిజమే జానకీ! అణాకానీకి మించి సంపాయించలేనివాణ్ణి ముక్కాని పెట్టి వక్కపొడి పొట్లం కొనడం తప్పే! ఈ తప్పునువ్వు క్షమించొద్దు. నీ యిష్టం వచ్చినట్లు తిట్టు—కాని యిప్పుడు కాదు. ఆ కాశీపతిగాడు వెళ్లిపోగనే...తిట్టదలచుకున్నవన్నీ జ్ఞాపకం పెట్టుకుని మరీ తిట్టు!'

జానకమ్మ 'హు హు' అంటూ

తాపతి చేతుల్ని పురుగుని విసిరేసినట్లు విసిరేసింది.

తనమాటకు జానకమ్మ విరుచుకు పడబోయేసరికి సీతాపతికి గుడ్డిలో మెల్లలా గుండెల మీది బరువు దించినట్లయింది. కొద్ది కొద్దిగా సంతోషం కూడా కలిగింది. ధైర్యం తెచ్చుకుని, బయటకెళ్ళబోతున్న జానకమ్మనుద్దేశించి 'మరి మాకు భోజనాలు వడ్డిస్తావా?' అన్నాడు.

జానకమ్మ టక్కున ఆగింది. యేదో వినరాని విషయం విన్నట్లు సీతాపతికేసి చూసింది.

''మాకు' అంటే ... అతణ్ణి కూడా భోజనానికి పిలిచేరా?'

సీతాపతి నమల్టానికి నీళ్ళులేక జానకమ్మ పూనకం చూళ్ళేక కళ్ళు దించేసుకున్నాడు అవునన్నట్లు తలాడిస్తూ.

జానకమ్మ చేతిలోని చొక్కాను నేలకేసి కొట్టింది. రుసరుసా సీతాపతికేసి చూసింది.

'నన్నడక్కుండా భోజనాలకీ ఫలహారాలకీ ఎవర్నీ పిలవొద్దన్నానా ... అన్నానా లేదా?'

'అన్నావు కాని... వాడు అకస్మాత్తుగా కన్పించేడు.'

'అకస్మాత్తుగా కన్పించినా ఆకాశం నుండి వూడిపడినా నాకు చెప్పందే ఎవర్నీ పిలిచే అధికారం మీకు లేదు...తెలిసిందా?'

'తెలిసింది. కాని...యివాళ్టికి...'

'అదేం కుదరదు!'

సీతాపతికి కళ్ళనీళ్ళ పర్యంతమైంది. అవతల భోజనానికి వచ్చింది ఎవడో దార్నపోయే దానయ్యకాదు. బిచ్చమెత్తుకునే భిక్షాలూకాదు. స్వయాన తన మిత్రుడు. వాడిని భోజనానికి రారా అంటూ ఘనాగా పిలిచి 'మా ఆవిడ పెట్టనంది పోరా' అంటే వాడేమనుకుంటాడు... తనను ఒక్తి అసమర్థుడికింద జమకట్టడూ! అలా జమకట్టింది చాలక తనమీద బోల్డు సానుభూతి కురిపిస్తాడే ... ఆ సానుభూతిని ఎలా భరించటం?

సీతాపతి చికాగ్గా ముఖం తుడుచుకున్నాడు. జానకమ్మ యేం యెరగనట్లు అలమార సర్దుకుంటూంది.

అలాగే...రాస్కెల్ని...అలాగే...వెనకనుండి వెళ్ళి పెడీల్ని తన్నాలి. ఏడుస్తున్నవాన్ని

# ముగింపు

జుట్టుపట్టుకుని మళ్ళీ తన్నాలి. నాకు నా ఫ్రెండుకి కాళ్ళుకడిగి అన్నం వడ్డిస్తావా లేదా అంటూ మళ్ళీ తన్నాలి. మళ్ళీ తన్నాలి మళ్ళీ మళ్ళీ తన్నాలి...

కాని...తను తన్నలేడు ... కాళ్ళు లేక కాదు...హక్కులేక!! తనకీ తన మిత్రుడికీ వడ్డించమని అడుగుతున్న భోజనం తన చెమటలో పండింది కాకపోవటంచేత!! అంచేతనే తనకు భోజనం పెట్టవూ అని అర్థించే అవకాశం మాత్రమే దొరికింది కాని 'అన్నం పెట్టావ్' అని గద్దించే హక్కు చిక్కలేదు. తను...తను...'భర్త' అనే ముసుగులోవున్న 'లైసెన్స్‌డ్ బెగ్గర్...'

అంతే...అంతే!

'జానకీ! నేనెంత అల్పుణ్ణయినా నన్నింత నీచంగా చూడటం భావ్యంకాదు. కావాలంటే...నీకు కొత్త జోళ్ళు కొనిస్తాను. నన్ను కోసెయ్. నా ముఖం చెక్కెయ్... ముక్కు చెక్కెయ్. శరీరం యావత్తూ గాయాలు చేసి నీ కసి తీర్చుకో...కాని...పరాయివాడి ముందు యిలా... యిలాచేసి నా గుండెల్లో గునపాలు దింపకు ... ప్లీజ్ నీకు చేతులెత్తి నమస్కరిస్తాను ... జానకీ నమస్కరిస్తాను!'

'..............'

'ఈ ఒక్కసారికి నామాట విను జానకీ! లేచి వాడికి భోజనం వడ్డించు... కావాలంటే...కావాలంటే...నేనీపూట భోజనం మానేస్తాను జానకీ!'

జానకమ్మ కాస్త ఎక్కువగానే ఆలోచించింది. చివరకు 'ఊ' అంది, 'ఏదో యేడ్చిపోతారని ఈసారికి సరే అంటున్నా' అనే ధోరణిలో!

సీతాపతి ఆనందించేడు. అగ్గిపెట్టె లేనివాడికి నిప్పుదొరికినంత సంబరమైంది. అడ్డమొచ్చిన గుడ్డతో ముఖం తుడుచుకుని వరండాలో కెళ్ళేడు.

వరండాలో జెండా కర్రలా కాశీపతి అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. చేస్తున్నవాడల్లా ఆగి సీతాపతికేసి చూసేడు.

అత్తగారింట్లో అనన్య సామాన్యమైన కష్టాలనుభవిస్తూ పుట్టింటివారు రాగానే ఇంద్రధనస్సులా నవ్వుతూ పలకరించే కోడలి ముఖంలావుంది సీతాపతి ముఖం.

సీతాపతి కాశీపతిని చూసి సన్నగా నవ్వేడు. 'సారీరా! కాశీపతీ! నా ఆవిడతో మన స్నేహం, మన చిన్ననాటి ముచ్చట్లు గురించి చెప్తుంటే టైం తెలీలేదు. ఊఁ ఊఁ ... లే ... లేచి కాళ్ళు కడుక్కో భోంచేద్దువుగాని!'

'భోజనానికేంగాని యివాళేం వారండా సీతాపతీ'

'సోమవారం!'

కాశీపతి వులిక్కిపడ్డాడు. 'రంజిట్! నయం! తొందరపడి పొరపాటు చేయలేదు. ఐయామ్ వెరీసారీరా సీతా. నేను సోమవారం రాత్రిళ్ళు భోజనం చెయ్యను. ఎంతైనా దేశసేవకుణ్ణిగదా!' కాశీపతి నవ్వేడు.

కాశీపతి తన పరిస్థితిని పసిగట్టేడని గ్రహించేడు సీతాపతి. అయినా బింకంగా 'పోనీ టిఫినైనా తీసుకుందువు గాని లే' — అన్నాడు, కాశీపతి ఎలాగూ ఒద్దంటాడన్న ధీమాతో.

కాశీపతి గుంభనగా నవ్వేడు. 'ఒరేయ్ సీతా! మీవూళ్ళో హోటల్లో నిన్న తిన్నది రేపటివరకు అరగదు. అలాటిది నేను నిన్న యివాళ కూడా తిన్నాను. అందుకే పొట్టచూడు పంజాగుట్టలాగుంది. బాబ్బాబూ...టిఫిన్ గిఫెనని మొహమాట పెట్టక ... యీసారి తప్పక వస్తాగా...'

సీతాపతిని మారుపలకనివ్వకుండా కాశీపతి గేటుకేసి నడిచేడు. సీతాపతి కాశీపతిని అనుసరించేడు. ఇద్దరూ కాంపౌండ్ వాల్ దాటి రోడ్డెక్కేక సీతాపతి దీనంగా అడిగేడు కాశీపతిని—

'ఏరాకాశీ! నామీదేమన్నా కోపమా?'

'లేదురా జాలి!!'

కాశీపతి వెళ్ళిపోయాడు.

సీతాపతి పళ్ళు పటపట లాడించేడు వెంటనే కళ్ళు టపటప లాడించేడు. కాశీపతికి తన్నుచూస్తే జాలి! గుమాస్తా గుర్నాధానికి తన్నుచూస్తే జాలి! పనిమనిషి పంకజాంకూ తన్నుచూస్తే జాలే! ఇంత మంది అంతజాలి కురిపించబట్టే తన ఒంట్లో పారుతున్న రక్తం కాస్తా చచ్చు నీరైపోయింది. తనఒంట్లో పారుతున్నది నీరుకాబట్టే తన పెళ్ళాం రింగ్ మాస్టర్‌లా మాటల కొరడాలు ఝుళి

పిస్తుంటే తను వాటినుండి తప్పించుకోవా లనే ప్రయత్నిస్తున్నాడుగాని వాటిని ఆప లేకపోతున్నాడు తను అశక్తుడు!...

అశక్తుడు గేటు తెరచుకొని లోపలి కెళ్ళాడు. జానకమ్మ వంటింట్లోంచే కేక వేసింది భోజనానికి రమ్మని.

'నా కవసరం లేదు!'

జానకమ్మ గరిటె పుచ్చుకుని బయట కొచ్చింది.

'ఏమిటీ! అన్నం అవసరం లేదా? మీరు సంపాదించి పోస్తున్న రాసులేమన్నా మూలన మూలుగుతున్నాయనుకున్నారా వండింది వండినట్లు పారేసేందుకు!'

సీతాపతి వారు పలకలేదు. మౌనంగా లోపలికెళ్ళి పీటవాల్చుకు కూచున్నాడు. జానకమ్మ గిన్నెలు మోగించి పళ్ళెంతెచ్చి పీటముందు పెట్టింది.

సీతాపతి అమ్మవారు పూసిన అయ్యవారిలా అన్నం వాయలు వాయలుగా కలిపి గొంతులోకి తొయ్యటమే పనిగా పెట్టుకున్నాడు. తనకిష్టంలేని చింతకాయపచ్చడి. పొదినాక్కు పచ్చడిలోనే నీళ్ళు నిండిన కళ్ళతో తినేశాడు తనలో వున్న కోపమంతా చేయి కడుక్కోవటంలో చూపిస్తూ — 'నా వాటా యింకేమన్నా మిగిలితే వుంచు తెల్లవారేక తింటాను' అన్నాడు.

'రోషాలకు మాత్రం తక్కువేం లేదు...' జానకమ్మ మూతి చకచకా తిప్పేసింది.

కాలుతున్న పెనం మీద నీళ్ళుపడినట్టు వుడికిన సీతాపతి గుండెమీద కారం చల్లింది. చేయి తుడుచుకుంటున్నవాడల్లా తుండుగుడ్డను అవతలపారేసి 'ఏం ఎందు కుండాలి తక్కువ' అంటూ దురుసుగా వచ్చి జానకమ్మ చేయి పుచ్చుకుని గుంజేడు.

వంగి కంచాలు తీస్తున్న జానకమ్మ పట్టుతప్పి బోర్లాపడబోయి చతికిలపడింది ముగ్గుల్లోని హఠాత్పరిణామానికి క్షణ కాలం బిత్తరపోయి తేరుకుని శాపనార్థాలు మొదలెట్టింది.

'ఓరి దేవుడో గంగ గోవులాటి నన్ను పట్టుకుని చావకొడుతున్నార్రో దేవుడో! వాడెవడో జులాయినాడికి వండి వార్చలేదని పగపట్టి సిగ పట్టుకుంటున్నార్రో రాముడో! నా పుట్టింటి సొమ్ము పుటక తేనెలా తాగి కండబలిసి నా గుండె కోస్తున్నార్రో భగవంతుడా! అమ్మో నాయనా! ... నన్ను కొట్టిన చేతులు ఎన్నాళ్ళో వుండవ్...పక్షవాతంవచ్చి పడిపోతే ...అమ్మో... నాయనా!!'

జానకమ్మ కూచున్న చోట్నుండి లేవ లేదు. నెత్తినచేయి తీయలేదు. ముక్కు చీదటం మానలేదు.

సీతాపతి ముఖంమాత్రం చింకి చాపలా పాలిపోయింది. (జానకమ్మ పుట్టిల్లు— పుటక తేనె అప్పుడల్లా అలానే వుంటుంది) 'ఛీ ఛీ' అనుకుంటూ అవతలి కెళ్ళి చొక్కా తీసుకుని, వేసుకుని బయట గేటుదాకా వెళ్ళాడు. చుట్టుపక్కలవాళ్ళు రోడ్డున పోయేవాళ్ళు తనను జూలో దెబ్బలుతిన్న జంతువులా చూస్తున్నట్లనిపించి ఆగేడు. తెరవబోయిన గేటు తెరవకుండా యింట్లోకెళ్ళిచాపతెచ్చుకుని వరండాలో అరుగుమీద వేసుకూచున్నాడు.

వీధిచివరి కొత్తసినిమా వదిలినట్లున్నారు — జనం బస్తాల్లోంచి గుమ్మరించినట్లు రోడ్డునిండా కాళ్ళమీనా, బళ్ళ మీద పడిపోతున్నారు. రిక్షాల్లో పార్వతీ పరమేశ్వరు లెళ్తున్నారు. వెనక నడుస్తున్న మగవాళ్ళు జ్యోతి లక్ష్మి డాన్స్











## ముగింపు

జ్ఞాపకం చేసుకుని ఇంటికి వెళ్ళేందుకు తొందర పడ్తున్నారు. తగలాలనుకుంటున్న మగవాళ్ళను తప్పుకుంటున్న ఆడవాళ్ళు కృష్ణకుమారి కష్టాలు తలుచుకుని 'చ్ చ్ చ్' అంటున్నారు. మధ్య మధ్యలో రతీ మన్మధులు జంటలు జంటలుగా నడిచెళ్తున్నారు. అందులోంచి ఓ రతీదేవి మన్మధుడితో అంటోంది—'యీ యింటి కేసిన రంగు మనింటిక్కూడా వేయిస్తే బాగుంటుంది కదండీ!'

'మన యిల్లు!' ఎంత చక్కగా అంది రతీదేవి!

ఎప్పుడూ 'నా యిల్లు — నా యింటికి సున్నం కొట్టించాలి నా యింటిని బాగు చేయించాలి' అవటం తప్పితే 'యేమండీ మనింటికి సున్నం వేయిద్దామండీ, మనిల్లు బాగుంది కదండీ' అని నోరారా అడిగిన పాపాన పోయిందా జానకమ్మ!?

పోదు! పోవటానికి యీ యిల్లు తన కష్టార్జితం కాదాయె! ఆవిడ పుట్టింటి వారు ఆమెను సుఖంగా, నీటిలోని కలువలా వుండమని యిచ్చిందాయెను. కనుకనే 'ఇది నా యిల్లు' అని బల్ల గుద్దుతోంది! గుద్దనీ తప్పులేదు! ఈ యిల్లు ఆవిడదే! తను కూచున్న అరుగు, అరుగుమీద చాప, చాపమీద మనిషి అన్నీ ఆవిడా ఆవిడ పుట్టింటివారూ కలిసి పైసలు చల్లి పండించినవే! తను తొడుక్కుంటున్న చొక్కాలు తింటున్న తిండీ అంతా జానకమ్మ భిక్షే! జేబులోని డబ్బులూ కంటి మీది అద్దాలు అన్నీ జానకమ్మవే! ఒక్క అభిమానమే తనది!

ఆవిడ మాటలకు అది ఎప్పుడో చోటు పోయి ఎప్పట్నుండో చోటి మోత మోగుతుంది. ఇవాళ పరాయివాడిముందు పదహారు వక్కలైంది. అవమానం జయించింది. మనసును విరిచింది. విరిగిన మనసుతో కరగని మనిషితో కాపురం చేయలేడు, తను. ఈ నరరూప రాక్షసి మాటల కోరల్లో రోజూ చచ్చేకంటే ఒకేసారి గుటుక్కుమనటమే హాయి.

'అదే వెధవపని! ఒకరికి భయపడి ఆత్మహత్య చేసుకోవటమనేది మూర్ఖుడు చేసే పని. ఒక మార్గంలో సుఖం దొరకనప్పుడు మరొక న్యాయమార్గాన ప్రయాణం చేయటం తెలివైనవాడు చేసేపని. ఈ పిచ్చాలో హీరో మొత్తానికి తెలివైన పనే చేశాడు' సినిమాచూసి హోటల్లో తిని ఇళ్ళకెళ్తున్న యిద్దరు వర్ధమాన జర్నలిస్టుల్లో ఒకడన్నాడు, రెండోవాడు విన్నాడు.

రెండోవాడితోపాటు సీతాపతి కూడా విన్నాడు. కాసేపు ఆలోచించాడు. జేబులోని డైరీ తీసేడు. డైరీకున్న పెన్సిల్ తీసేడు. తెరిచిన డైరీలో వో కాగితంమీద రాసేడు.

'భర్త అంటే భరించేవాడని తెలుసుగాని భరించవలసింది మాటిపోటిమాటలు అవమానాల ఆటుపోట్లని తెలీదు. తెలీకే నీకు నన్ను అమ్ముకున్నాను. అయిందేదో అయిపోయింది. నీదగ్గర తరగని డబ్బుంది. పెరిగే అహముంది. అప్పనవాళ్ళ భర్త అనబడే నేను నీ అందమైన యింట్లో క్రోటన్ మొక్కలాటివాడిని. క్రోటన్ మొక్క లేకపోయినా యిల్లేం చిన్నబోదు. అందుకే వెళ్తున్నా సదానందాశ్రమానికి. దయచేసి వెంబడించకు'

కాగితాన్ని నాలుగ్గా మడిచి పడుకునున్న డైరీలోంచి మడచి చాపదిండ పెట్టేడు.

మొగుడు అరుగుమీద పడుకున్నాడని తెలిసికూడా లోపలికి పిలవకుండా ఎప్పటికే తలుపులేసుకు పడుకుంది, జానకమ్మ!

'ఇక వాగుడుపుగాని పోటికొచ్చినట్లు' అన్నట్టు కసిగా తలూపేడు సీతాపతి, జానకమ్మ గదికేసి చూస్తూ.

జానకమ్మ గదిలోని గడియారం పదకొండుసార్లు నోరు పారేసుకుంది. మరో గంటకు పన్నెండుసార్లు పళ్ళికిలించింది.

సీతాపతి మెల్లగా లేచేడు. అడుగులో అడుగువేసుకుంటూ గేటు దాటేడు. అక్కడ్నుంచీ అడుగుకీ అడుగుకీ సంబంధం లేకుండా 'ఉద్యోగం యిస్తాం రా' అనగానే పరుగెత్తుకెళ్ళే నిరుద్యోగిలా స్టేషన్‌కు పరుగెట్టుకెళ్ళేడు.

ఎటెళ్ళేదోగాని మొత్తానికో బండి వుంది స్టేషన్లో. సీతాపతి ఓ పెట్లో యెక్కి కూచున్నాడు. కూచుందుకు ఓ కుటుంబరావుగారి ట్రంకుపెట్టె, ఆనుకుందుకు ఓ దుబ్బు గడ్డం మనిషి దొరకటంతో యిట్టే నిద్రపట్టేసింది.

మెలకువ వచ్చేసరికి తెల్లవారింది. బండి యేదో స్టేషన్లో ఆగుంది. అంతవరకు ని టికెట్ ఎగ్జామినరూ తన జోలికి రానందుకు సంతోషిస్తూ బండి దిగేడు. బండి కదిలేంతవరకూ దైర్యేవనివాడిలా ప్లాట్

పారం అంతా తిరిగి బాడి పోయి; గేటు దగ్గర టికెట్ కలక్టరూ పోయి పడుకో గనే తను బయటపడ్డాడు.

కొత్తవూళ్ళో, పాతకాళ్ళతో పొట్ట మోతతో తిరిగేడు— అరిగేడు — అందర్నీ అడిగేడు—'యీ వూళ్ళో యేవన్నా వుద్యోగాలు దొరుకుతాయా' అని.

'ఈ వూళ్ళోనే కాదు యీ దేశంలోనే దొరకవ్!'

ఇలాటి సమాధానాలు వింటూ తిరిగే కొద్దీ సీతాపతికి ఆకలెక్కువవుతూంది— తెలివితక్కువవుతూంది. ఇక లాభం లేదనుకుని ఎవరో పెద్దమనిషి చెప్పిన దారి పట్టుకుని అభేదానందాశ్రమానికి పోయి అభేదానంద స్వామివారిని ఆశ్రయించేడు.

సాగిములవారు అరకన్నులతో నిండుగా నవ్వేరు.

'నాయనా సీతాపతీ! నువ్ స్త్రీ వ్యామోహం వుంచుకోకూడదు. సుఖానికి ముఖం వాచిపోకూడదు. ఆకలిదప్పుల్ని నీ నిఘంటువునుండి తొలిగించాలి. ఎంతసేపటికి ఆ శ్రీమన్నారాయణుడి జపమే నీలో నీ మదిలో జీవనదిలా పారుతూండాలి. అలా చేయగలపంక్షలో ఆశ్రమంలో చేరు. చేరి మోక్షం సాధించు. నీ చరిత్రకూడా పతీ సక్కుబాయి చరిత్రలా పతి సీతాపతి పేరుతో వాసికెక్కి ఆచంద్ర తారార్కం వెలుగొందుతుంది!'

సీతాపతి 'అలాగే సార్' అని తరవాత 'తప్పు తప్పు ధన్యుణ్ణిస్వామి' అని ఆశ్రమంలో ప్రవేశించాడు.

తనుచేరిన వారానికి ఆ ఆశ్రమానికి మరో ఆశ్రమాధిపతి సదానందస్వామివారు అధికారపర్యటన కొచ్చారు. ఓరోజు సీతాపతి ఎవరూలేకుండా చూసి సదానందస్వామి పక్కనచేరి పలకరించేశాడు.

'స్వామీ! నేను జానకమ్మ మొగుణ్ణి. జానకమ్మగాని నాకోసం తమ ఆశ్రమానికొచ్చి...వాకబులాటి దేవన్నా చేసిందా... అని!'

స్వాములవారు వేదాంతం నమిలేరు.

'నాయనా సీతానందా! సదానంద అనేవాడు నాలోనేనా వుంది? నీలో లేడా వాడిలో లేడా వీడిలో లేడా!!! ఇందరిలో వున్నవాడిని ఎక్కడని వెతగ్గలదు యేమని అడగ్గలదు నాయనా నీ ధర్మపత్ని!'

తను ఇల్లువదలిరాగానే జానకమ్మ కూడా వుడిగా సదానందాశ్రమానికి వెళ్ళి వెతుకుతుందేమో తెలుసుకుని ఆనందిద్దామనుకున్నాడు సీతాపతి. కాని సదానందగారి మాటలు విన్నాక జానకమ్మ అటువంటు ప్రయత్నమేమీ చేయలేదని తెలిసింది. కొద్దిగా బాధకలిగింది. ఎక్కువకోపం కలిగింది (ఈసారి కోపం ఏడ్పును జయించింది) వెంటనే వూళ్ళోవున్న పోస్టాఫీసుకెళ్ళి వాళ్ళావిడపేర 'నీ భర్త మోక్షం సాధించి స్వర్గంలోకంలోని ఓ ఖాళీని భర్తీచేశాడు యిట్లు స్వామి సదానంద' అని తంతి కొట్టేడు.

ఆ తర్వాత రెండ్రోజులకు స్వామీ సదానంద తమ ఆశ్రమానికి వెళ్ళిపోయేరు.

అలా వెళ్ళిన స్వాములవారి వద్దనుండి తన భార్య తాలూకు కబురేవన్నా వస్తుందేమోనని కాన్నాళ్ళా ఎదురుచూసేడు సీతాపతి. చూట్టం తప్ప చేసేది లేకపోయింది. ఇక లాభం లేదని ఆ విషయాన్ని పట్టించుకోక ఆసనాలు నేర్చుకోసాగేడు.

జుత్తు పెంచేడు, గడ్డం పెంచేడు, మీసాలు పెంచేడు మేకప్ లేకుండానే అల్లూరి సీతారామరాజు వేషానికి సరిపడేలా తయారయేడు.

ఉన్నట్టుండి వోనాడు, శీర్షాసనం వేస్తున్న అతగాడికి జానకమ్మ జ్ఞాపకం వచ్చింది. ఎలావుందో యేం చేస్తుందోనన్న 'యిది' ఒకటే యిదిగా 'యి(బ్బం)ది' పెట్టసాగింది.

ఆ 'యిది'కి తట్టుకోలేక శీర్షాసనం వేస్తున్నవాడల్లా లేచి సరిగా నిలబడి కాసేపు ఆలోచించి నేరుగా గురూగారి దగ్గిరికెళ్ళి—

'స్వామీ! నాకు దేశాటన చేయాలనుంది' అన్నాడు.

పెద్దస్వామి సీతాపతిని పైనుండి కిందకు చూసి పెదవి కదిపేరు.




'నాయనా నువ్వనుకున్న యువరాజావా దేశాటన చేసేందుకు ... అంత మోజుగా వుంటే రెణ్ణాల్లు భిక్షాటన చేసిరా పో.'

సీతాపతి 'ధన్యుణ్ణి స్వామీ' అని ఆ రోజేఓవూళ్ళోగై లెక్కి వాళ్ళూళ్ళోదిగేడు.

లంచాలు పుచ్చుకోనందుకు, మంత్రిగారు చెప్పినపని చెయ్యనందుకూ ట్రాన్సఫరై పోతున్న మంచి వుద్యోగిలా దిగులుగా పశ్చిమానికి వెళ్ళిపోతున్నాడు సూర్యుడు.

అమ్మాసి వికటాట్టహాసంచేస్తూ వూరిని అలుముకుంటున్నాయి చీకటి శక్తులు.

సీతాపతికి ఆ వూళ్ళో అడుగు పెట్టగనే చక్కిలి గింతలాటి అనుభూతొకటి కలిగింది. మీ సాల్లో గడ్డాల్లో నవ్వులు పండిస్తూ మెల్లిగా తనయింటివైపు నడిచి యింటిదగ్గర ఆగేడు.

ఇంటి ముంగిట. ఓ స్త్రీ, తల చెడిన (నిజంగా తల బాగానేవుంది) స్త్రీ యిస్త్రీ మడతల్లోవున్న మరో స్త్రీతో మాట్లాడుతూంది. మధ్య మధ్యలో తన తెల్లచీరె చెంగుతో నల్లకళ్ళను తుడుచుకుంటూంది. వినే స్త్రీ 'చ్ చ్' అంటూంది. ఆని ఆని విసుగు పుట్టిందేమో 'మళ్ళీ కలుద్దాం' అన్నట్టు తలూపుతూ గేటుదాటి పక్కింట్లో కెళ్ళిపోయింది.

తలచెడిన స్త్రీ ఇంట్లోకెళ్ళింది.

తలచెడిన స్త్రీని గుర్తుపట్టేడు సీతాపతి!

ఆమె—జానకమ్మ!!

'అయితే పాపం తను చచ్చిపోయాననుకుంటుందన్న మాట'— సీతాపతి చిర్నవ్వుకున్నాడు.

అటు యిటు చూసి గేటు తెరచుకుని లోనికెళ్ళాడు. నేరుగా యింట్లో కెళ్ళబోయిన వాడల్లా ఆగి పెరట్లో కెళ్ళే సందులో కెళ్ళాడు. జానకమ్మ గది కిటికీ మూసివుంది. మెల్లిగా తలుపులు నెట్టేడు. తెరుచుకున్నాయి తలుపులు. కనిపించింది జానకమ్మ!

ఆమె అప్పుడే లైటు వేసింది. వేసి యెదురుగావున్న నిలువెత్తు పటానికి భక్తి శ్రద్ధలతో నమస్కరిస్తూ నిలబడిపోయింది.

సీతాపతి తెరచిన నోరు మూయటం రెప్పవేయటం మరచిపోయాడు.

ఆ నిలువెత్తు పటంలో సీతాపతి ఫోటో వుంది!! ●




### జరిగిన కథ

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, శశి సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే ఆదాయమూ, ముకుందం తెచ్చే కొద్దిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. విశ్వనాధంగారు ఆ కుటుంబానికి అప్తుడు. సుందరం తెలివైన వాడు. అతనికి మద్రాసువెళ్ళి 'బియ్యే' చదవాలని వుంటుంది. మొదట్లో కొంత వెనకాడినా ముకుందం అతని అభిలాషని తోసిపుచ్చలేక పోయాడు. సుందరాన్ని అందరూ కలిసి మద్రాసు పంపిస్తారు. చదువుమీద శ్రద్ధచూపని శకుంతల మనస్తత్వం గ్రహించి ఒక మంచి సంబంధంచూసి పెళ్ళి చేసేస్తారు.

## 4

శకుంతల అత్తవారింటికి వెళ్ళిపోయిన మర్నాటినుంచి సుభద్రమ్మగారు మరో కొత్త ధోరణి మొదలుపెట్టింది.

'నువ్వింకా ఎన్నాళ్ళిలా వుంటావు—పాతికేళ్ళు పైబడ్డాయి— నీ ఈడువాడే వాళ్ళ కాంతమ్మగారి కొడుకు— అప్పుడే ఆవిడ మనవణ్ణి ఎత్తింది — ఇంక నాకో కోడలు రావాలి.' అని మొదటిసారి ఆవిడ అన్నప్పుడు—

'ఇప్పుడు నాకు అదొక్కటే తక్కువ.' అంటూ చిన్నగా నవ్వేశాడు ముకుందం.

'ఔను. అదొక్కటే లోటు — కోడలు లక్షణంగా ఇల్లంట తిరుగుతూంటే ఇంటికే కళ వస్తుంది.' అంది.

'ఆ—ఏమిటో పెద్దవాళ్ళ చాదస్తం.' అనుకుంటూ తల్లికి మరేమి సమాధానం చెప్పకుండానే మరో పనిమీద వెళ్ళి పోయాడు.

కొడుకు అభ్యంతరాన్ని ఆవిడ అంతగా లెఖ్కచెయ్యదలుచుకోలేదు. అందుకే అవకాశం దొరికినప్పుడల్లా అదే విషయం ధోరణిగా మాట్లాడుతూంటే ఒకనాడు కాస్త చిరాగ్గానే సమాధానం చెప్పాడు ముకుందం—

'ఏమిటమ్మా నువ్వూ—మన పరిస్థితు లేమిటో కొంచెం అయినా ఆలోచించ కుండా అలా కోడలూ మనవడూ అంటూ ఖంగారుపడిపోతున్నావు— సుందరం చదువు ఇంకా పూర్తి కానేలేదు—ప్రకాశం కూడ కాలేజీ చదువుకి అందుకుంటాడు మీదటికి. సరే నీ లెఖ్కని మరో రెండు మూడేళ్ళ కయినా శశి పెళ్ళి చెయ్యాలి......'

వినిపోయినట్లు బుగ్గలు నొక్కు కుంటూ అంది సుభద్రమ్మ. 'అయితే ఏమిటి నువ్వనేది — అందరి చదువులు పెళ్ళిళ్ళు అయి నీ బాధ్యతలన్నీ తీరేదాకా ఇలాగే వుంటావా—అయినా నాకు తెలియక అడుగుతాను — ఇప్పుడు కోడలు వస్తే మాత్రం అవి తీరకుండా వుండిపోతాయనా?'

'ఏమో ఏదైనా జరగొచ్చు — ఈ ప్రపంచంలో మనిషికి ఎప్పుడు ఏలాంటి బుద్ధి పుడుతుందో మనం ఏమీ చెప్పలేం.'

'ఊ.' నిష్ఠూరంగా నిట్టూర్చింది ఆవిడ.

'నీకు తెలియనిదీ కొత్తగా చెప్పాల్సినదీ ఏమీ లేదు—మొన్న శకుంతల పెళ్ళికి అయిదువందలు పైగా అప్పు చేశాం. ఇంకా అల్లుడ్ని పండగకి తీసుకురావటం ఆ లాంఛనాలన్నీ అలాగే వున్నాయి. సుందరం చదువుకయినా మనం అనుకున్నట్లు కేవలం నా జీతం చాలటంలేదు— ఈ రెండు మూడేళ్ళలోనూ చేసిన ఆ అప్పు వెయ్యి పైనేవుంది. ఈ ఏడాది రెండెకరాలు అమ్మేశాం కాబట్టి ధాన్యంకూడ తక్కువే వస్తాయి—పైగా పొలంలో పెంట తోలించాలి ఏవో మరమ్మత్తులు చేయించాలని నిరుటినుంచి సూరయ్య మొత్తుకుంటు న్నాడు. ఆ ఖర్చంతా తడిసి మోపెడవు తుందేమో— ఎంతయినా ఈ ఏడయినా చేయించకపోతే పొలం బొత్తిగా పాడై పోతుంది...ఇన్ని ఇబ్బందులతో మన సంసారం ఎలా గడుస్తుందో ఆలోచించుకో—అయినా మనలో మనమేకనక పచ్చడీ అన్నంతిన్నామో పాయసం తాగామో ఎవ్వరికీ తెలియదు— గుట్టుగా రోజులు గడిచిపోతున్నాయి...'

'అంటే ఇంక కోడలు వస్తే సంసారం వడివీధిలో వుంటుందనా నువ్వు చెప్ప బోయేది.'

'ఎంతయినా పరాయి ఇంటినుంచి వచ్చిన మనిషి మనలో కలవటానికి కొంతకాలం అయినా పడుతుంది—ఈలోగా మూతి ముడుచుకోటాలు దెప్పుకోటాలూ...'

'బాగానే వున్నాయి నీభయాలు' అందులో వింత ఏమీలేదు అనిపించినా కొడుకుమాట లనిమాత్రం సమర్థించలేదావిడ—

సుభద్రమ్మగారు అడగటం, ముకుందం కాదనటం అలా మరో ఏడాదిపైనే గడి చింది.

'ఇందాకా సీతారామయ్యగారు వచ్చారురా. నువ్వు లేవు—ఇవాళ ఆలస్యంగా వస్తావని చెప్పావని అంది శశి— సరే రేపు మళ్లీ వస్తానన్నాడు.' రాత్రి కొడుక్కి అన్నం వడ్డిస్తూ అంది.

'ఏదైనా పనిమీద వచ్చాడా.'

'ఏదో సంబంధం గురించి మాట్లాడటానికి.'

'ఎవరికి.'

ప్రక్కనే కూర్చుని అన్నాలు తింటున్న ప్రకాశం, శశి ఫక్కుమన్నారు. సుభద్రమ్మగారు ముసిముసిగా నవ్వుతూ, 'ఎవరికేమిటి నీకే' అంది.

'ఆయనొకడు నన్ను వదలకుండా పట్టుకున్నాడు.'

'పెద్దవాళ్ల తాపత్రయాలూ బాధ్యతలూ అలాగే వుంటాయి.'

'సరేలే—రేపు ఎన్ని గంటలకి వస్తానన్నాడు—నేనే సినిమాకో వెళ్లిపోతాను.'

'హాస్యాలు చాలుకాని, నా మాటమీద ఏమాత్రమైనా గౌరవం వుంటే నేను చెప్పింది శ్రద్ధగా విను.' తల్లి గొంతులో వచ్చిన మార్పు కనిపెట్టి ముకుందం బుద్ధిగా కూర్చున్నాడు. ప్రకాశం, శశి గబగబ అన్నం తిని చేతులు కడుక్కొని లేచి వెళ్లిపోయాడు.

'నీ పెళ్లాం వస్తే దాని మోజులోపడి నన్నూ పిల్లల్నీ సరిగ్గా చూడవనే భయంతో నేనే కావాలని పెళ్లిమాట తల పెట్టటంలేదు అనే నింద నా నెత్తిని రుద్దటం నీకిష్టమా—చెప్పు.' నిలదీస్తున్నట్లే తల్లి అడిగేసరికి గతుక్కుమన్నాడు ముకుందం—పైగా ఆవిడ చెప్పిన విషయం అసలు ఎప్పుడూ అతని వూహకే రాలేదు—ఛ—అంత మూర్ఖంగా ఎవరంటారు—అనుకొంటూ, 'ఎవరన్నారు ఆమాట' అంటూ చిరాగ్గా చూశాడు తల్లి కళ్లలోకి.

'ఎవరేమిటి—మరో నాలుగు రోజులు పోతే అంతా అంటారు—మొన్నటికి మొన్న ఆ శేషమ్మగారు నా మొహమ్మీదే అంది నాకేదో సలహా చెప్తున్నట్లు. 'ప్రకాశం చదువూ శశి పెళ్లి అయిపోయిందాకా పెద్దవాడికి పెళ్లిమాట తలపెట్టొద్దు వదినా' అంటూ—నాకు ఒళ్లు మండిపోయింది ఆవిడ వెక్కిరింతకి—'ఏడాదిగా చెప్తూనే వున్నాను వాడి చెవిని పెట్టటం లేదమ్మా—ఎలాగైనా ఈ శ్రావణంలో ఆ శుభకార్యం జరిపించేస్తాను' అన్నాను కోపం అణుచుకుని—అంటే ఆవిడేమందో తెలుసా. 'ఏమోనమ్మా ఈ కాలం పిల్లలు—వచ్చిన మర్నాడే వేరింటి కాపురం అంటారు—ఇప్పుడంటే కొడుకు నీ చెప్పుచేతల్లో వున్నాడు కనక ఏ ఖర్చయినా వెనక్కి తియ్యకుండా నీ ఇష్ట ప్రకారం జరుపుతున్నాడు — శకుంతలని పురిటికి తీసుకు వచ్చేముందు మూడిదలూ అవీ బోలెడు ఆట్టహాసంగా చేశావు—మొన్న బాలసారె అంతకన్నా ఘనంగా జరిపించావు—ఏలాగయినా కోడలుంటే కొడుకు చెయ్యి అంత భారిగా సాగదు' అంది రహస్యం చెప్తున్నదానిలా—సరే — ఆవిడ అలా అందని కోపం తెచ్చుకునే హక్కు మనకేమీలేదు కాని' నాతల సిగ్గుతో ఎలా వాలిపోయిందో నీకు చెప్పలేను—'

ముకుందం ఏమీ సమాధానం చెప్పలేదు.

'చూడు మరో ఏడాదిపోతే సుందరం చదువయిపోతుంది—వాడికేదో వుద్యోగం దొరుకుతుంది—అంతగా మీ ఆవిడతో పడకపోతే నేనూ పిల్లలూ వాడిదగ్గర—'

'అమ్మా...ఆ పెళ్లేదో నాకుచేసి నీదారిన నువ్వు వెళ్లిపోతావా—చివరికిలా సాగుతున్నాయన్నమాట నీ ఆలోచనలు—



ఇన్నాళ్లూ కాపరంచేసిన ఈ వూరు. ఈ స్వంతఇల్లూ అన్నీ వదిలిపెట్టి మీరంతా దేశాలు పట్టిపోండి - నేనూ నా భార్యా ఈ ఇంట్లో కూర్చుంటాం — అదేనా నువ్వు చెప్పబోయేది...' ముకుందం గొంతులో ఆవేశం సుళ్లు తిరిగింది — అతని చిరాకు చూసి చిన్నగా నవ్వుకుంది ఆవిడ — 'అబ్బ, యధాలాపంగా అన్నాలే— అయినా—కోడలొచ్చి ఇవాళే మనల్ని వేరు చేసేస్తుంది అన్నట్లు మాట్లాడ్డం ఏమిటి మనం—ఎక్కడో నూటికి కోటికీ ఒకరు తప్ప అంతా అలాగే వుంటారా ఏమిటి ... ఇందాకా సీతారామయ్యగారు చెప్పిన సంబంధం నాకు అన్నివిధాల నచ్చింది—అమ్మాయి చాలా బుద్ధిమంతు రాలుట...నిన్ను ఒప్పించటానికి ఆ గొడవంతా చెప్పాను కాని అసలా శేషమ్మ ఖబుర్లు నీతో చెప్పవలసినవి కావు...ఏం పిల్లని చూసినట్లావా —'

ముకుందం మాట్లాడలేదు. అతని ఆఫీసులో పనిచేసే సత్యనారాయణ గుర్తు వచ్చాడు. అతని భార్యా తల్లీ తెల్లవారి లేచిందగ్గరనుంచి ఎందుకో - అందుకు పోట్లాడుకుంటూనే వుంటారుట. ఒక్కొక్కరోజు ఇంక కేక లేసుకునే ఓపిక లేక కాబోలు ఇద్దరూ చెరో మూలా ఏడుస్తూ పడుకుని పొయ్యిలో నిప్పుకూడ రాజెయ్యరట. ఇంక ఆ పూటకి సత్యనారాయణ అన్నం తినకుండానే ఆఫీసుకి వస్తాడుట—ఈ గొడవలన్నీ ఎవరో చెప్పారు ఆమధ్య—

తన భుజాలమీద ఇంకా బోలెడు బరువుకూడ వుంది—పెళ్ళయిన మర్నాటి నుంచీ అలాంటి గొడవలు తలెత్తాయంటే ఇంక అడగక్కర్లేదు తన గోడు, కాని అమ్మ చెప్తున్నదేమిటి —నా మూలంగా ఆవిడ నలుగురిలోనూ చిన్నబుచ్చుకోవలసి వస్తోంది —

'మాట్లాడవేం—నువ్వు ఇప్పుడు పెళ్లి చేసుక్కుంటాను అని చెప్పకపోతే నేనీ పూటనుంచీ అన్నం తినను—' అంది బెదిరిస్తున్నట్లు.

తల్లి మొహం చూస్తుంటే ముకుందానికి నవ్వు రాబోయింది— కాని ఆపుకుని, 'నువ్వు తినకపోతే రేపటినుంచీ నేనూ తినను' అన్నాడు గారంగా తల్లికళ్లలోకి చూస్తూ.

'చాల్లే, ఖబుర్లు నేర్చుకున్నావు బాగా — నేను గట్టిగా చెప్తే నాకొడుకు వినక పోడు అనే ధైర్యం వుండేది ఇన్నాళ్లూ— ఈ విషయంలో మాత్రం నీ మొండితనం ఏమిటో నాకు అర్థం కావటంలేదు— పెద్దదాన్ని ఇంట్లో వుండికూడ నీ సంగతి కాస్త అయినా ఆలోచించటంలేదు. ఎంతసేపు మిగిలిన పిల్లల ముద్దుముచ్చట్లే చూసుకుంటున్నాను అని నలుగురూ అను కోడం సరే — వాళ్ళందరి చదువులూ పెళ్లిళ్లూ పేరంటాలు, మళ్లీ పురుళ్లూ పుణ్యాలూ అంటూ బాధ్యతలు గుర్తు చేసుకుంటూ నువ్వెన్నాళ్లిలా బైరాగిలా బతుకుతావు—ఇది నాకు మాత్రం సంతోషంగా వుందనుకుంటున్నావా—ఏ వయసులో ముచ్చట ఆ వయసులో జరిగితేనే అందం చందం.' అంటూ గిన్నెలన్నీ సర్ది మూతలుపెట్టటం మొదలుపెట్టింది.

తెల్లబోయాడు ముకుందం — ఈవిడ నిజంగానే వుపవాసాలు ప్రారంభిస్తుందా ఏమిటి అనే భయంకూడ కలిగింది— మెల్లిగా అన్నాడు.

'నా భయాలు నాకు వున్నమాట నిజమే అనుకో—దాని కిలాంటి అర్థాలుతీసి నలుగురూ నిన్ను అడుగుతారని అనుకోలేక పోయాను — లేనిపోని నింద నీకు అంటగట్టటం ఎందుకు — నీ ఇష్ట ప్రకారమే పెళ్లి చూపులకి వెళ్తాను — కాని...'

'ఊ, ఏమిటి నీ సంశయం.' కొడుకు నోటంట ఆ మాత్రం మాట వచ్చిందే చాలునని సంబరంగా అంది.

'ఒకవేళ పిల్ల బాగుండకపోతే...'

'మంచి అనుమానమే వచ్చిందిలే—నేను అంత మూర్ఖంగా వుంటాననుకుంటున్నావురా—నీకు నచ్చినా నచ్చకపోయినా బలవంతాన నీ మెడకి కడతానా—ఈ సంబంధం కాకపోతే మరో సంబంధం—'ముందు వెళ్లి చూసిరా—తరువాత అన్ని సంగతులూ ఆలోచించుకుందాం' అప్పుడే కోడలు వచ్చి నట్టింట తిరుగుతున్నట్లే వూహల్లో తేలి పోతోందావిడ.

'నీ మాటే నెగ్గిందిగా, ఇంక అన్నం వడ్డించుకో.' ఆవిడ అంతక్రితం ప్రక్కకి జరిపేసిన కంచం తల్లి ముందు పెట్టాడు ముకుందం.

* * *

రాత్రి తొమ్మిది గంటలు దాటింది— అందరి భోజనాలు అయినాయి.

మరచెంబులో మంచినీళ్లు పోసుకుని పైన ఓగ్లాసు బోర్లించి మెల్లిగా తమ గదివేపు దారితీసింది యశోద.

తలక్రింద రెండు చేతులూ పెట్టుకుని వెల్లకితలా పడుకుని పరధ్యానంగా ఎటో చూస్తున్న ముకుందం గదిలో మట్టెల చప్పుడు గాజుల గలగల వినిపించి చూపులు కొద్దిగా ప్రక్కకి తిప్పాడు — యశోద తలుపులు వేసి మరచెంబు ఓవారగా పెట్టింది. తల తిప్పకుండానే క్రీగంట మంచంవైపు చూసింది — తననే చూస్తున్న భర్త చూపులకి దొరికిపోయి చటుక్కున తల వాల్చేసుకుని, టేబిలుమీది వస్తువులు అటువి ఇటూ, ఇటువి అటూ సర్దుతూ అక్కడే నిలబడిపోయింది.

నవ్వుకున్నాడు ముకుందం. 'నువ్వు మరీ అంతలా సర్దేశావంటే రేపు ప్రొద్దుట నాకేవస్తువు అసలు దొరక్కుండానే పోతుందేమో—జాగ్రత్త.'

సిగ్గుపడిపోయింది యశోద— అయినా అక్కణ్ణించి కదలలేదు— చేతికి అందిన పుస్తకం తెరిచి పుటలు తిరగేస్తూ నిలబడి పోయింది—అలా బిడియంగా నిలబడిపోయిన ఆమెనే రెప్పవాల్చకుండా చూస్తున్నాడు ముకుందం...

'అప్సరసలని తలదన్నే అందంకాదు కాని యశోద మొహంలో కళ్లల్లో ఏదో నిర్మలమైన కాంతి వుందనిపిస్తుంది— అమాయకత్వాన్ని, అభిమానాన్ని నింపుకున్న ఆ చూపులు ఎదుటివారి ఆత్మీయతని ఇట్టే పొందగలుగుతాయి.

కేవలం తల్లిని సంతృప్తి పరచటానికి, మొక్కు తీర్చుకున్నట్లు వెళ్లి వచ్చేయాలనుకున్న తను ఆ చూపులకే బందీ అయిపోయాడనటం అబద్ధంకాదు—అయితే అంత సున్నితమైన సందర్భంలో కూడ తన మనస్సులో ఏదో సంశయం భయం తల ఎత్తటం తప్పలేదు.

అందరు ఆడపిల్లల్లాగే ఈ అమ్మాయి కూడ పెళ్లి అన్నా సంసారం అన్నా ఎన్నో కలలు కంటూ వుండవచ్చు —మాది


స్త్రీలకు కొన్ని
రోజులలో అసౌఖ్యము
కలిగి, బాధగా
వుంటుంది. అట్లాంటి
రోజులలో సారిడన్
వారికి ఉపశమనము
నిచ్చుటయు
నవోత్సాహములను
కూడా కలిగించును.
సారిడన్

STA-VT-8433

అతి సామాన్యమైన సంసారం — ఆలుమగలు ఆనందంగా బ్రతకటానికి డబ్బు ఒక్కటే ప్రధానం కాదు కాని, ఆ వున్నదేదో తిని హాయిగా చెట్టాపట్టా లేసుకుని నవ్వు కుంటూ తుళ్ళుకుంటూ బ్రతుకుదాం అనే పరిస్థితులు కూడ కావు — సంసారంలో స్వేచ్ఛ స్వాతంత్ర్యంలాంటివి కొన్నాళ్ళదాకానయినా తనకి వుండవు — ఆ సంగతి కూడ స్పష్టంగా చెప్పేస్తేనో అనిపించింది — కాని ఆ సమయంలో తన వుద్దేశ్యం బైట పెడతానంటే అమ్మా వాళ్ళూ ఎన్ని చివాట్లు వేస్తారో గుర్తు తెచ్చుకుని నోరుమూసుకు వూరుకున్నాడు...'

రివ్వున ఒక గాలి తెర వచ్చి కిటికీ రెక్కలు కొట్టుకోటంతో అతని ఆలోచనలు తెగిపోయాయి — యశోద కూడ ఒక్కసారి ఉల్లిపడి, పుస్తకం మూసి కిటికీవేపు ఒక అడుగు వేయబోయింది. అంతలో ముకుందం లేచి వెళ్ళి తలుపులు కొట్టుకోకుండా కొక్కాలు పెట్టి వచ్చాడు.

దక్షిణ వేపుకి వున్న ఆ కిటికీలోంచి కల్లటిగాలి ధారాళంగా వస్తోంది — ఎంత చలికాలమైనా ఆ కిటికీ మూసుకోటం అతని కిష్టం వుండదు. ఆ గదిని ఆనుకుని అటువేపు వున్న పెరట్లో జాజి పందిరి వుంది — ఇంచుమించు సంవత్సరం పొడుగునా అది పూస్తూనే వుంటుంది — సాయంకాలం శకుంతలలో శశిరేఖో మొగ్గ

# ఆశలూ అనుభవాలూ

లన్నీ కోసేసుకున్నా వాళ్ళ కంటపడకుండా వాళ్ళకి అందకుండా ఆకులసందునా అక్కడా అక్కడా వుండిపోయిన మొగ్గలు దీపాలు పెట్టేవేళ్ళకి విచ్చుకుని మెత్తటి పరిమళాన్ని వెదజల్లుతూ వుంటాయి — చల్లటి గాలితోపాటు వచ్చే ఆ మృదువైన సౌరభంకోసమే అతనా కిటికీ తెరుచుకుని దాని ప్రక్కగా మంచం వేసుకుంటాడు — ఇవాళ గదిలోకూడ యశోద తలలో విచ్చుకుంటున్న జాజులు వాతావరణాన్ని మరీ ఆహ్లాదకరంగా మత్తుగా మార్చేశాయి.

'ఇలా ఎంతసేపు నిలబడతావు —' కిటికీ ప్రక్కగా నిలబడి అలా బయటికి వెన్నెలలోకి చూస్తున్న భర్త, తనకి దగ్గరగా వస్తున్నట్లు గ్రహించుకునే లోపునే హఠాత్తుగా తనని చుట్టేసిన రెండు చేతులలోనూ ఒదిగిపోయింది యశోద.

'కాళ్ళునొప్పి పెట్టటంలేదూ.'

'లేదు,' అన్నట్లు తల వూపింది.

'ఎలావుంది అత్తవారిల్లు — పనంతా చేసి అలిసిపోయావా'.

'సాయంకాలమే రైలు దిగివచ్చావు — ఇవాళ్టికి నువ్వే పని ముట్టుకోవద్దు నేను చూసుకుంటాలే అన్నారు అత్తయ్య — నేను వూరికే అక్కడ నిలబడ్డానంతే — ఏపనీ చెయ్యనివ్వలేదు' యశోద పెదవి విప్పి మాట్లాడింది.

'ఊఁ చూశావా — అమ్మకి ఎంత గారమో నువ్వంటే.' అంటూ తమకంగా తన కంఠంమీద ముద్దు పెట్టుకుంటున్న భర్తని 'మరి, మీకు'. అని అడగాలని పించింది. కాని సిగ్గుతెర అడ్డువచ్చి మాటల్ని పెదవులచాటునే బంధించేసింది.

'...యశూ — నీతో ఒకమాట చెప్పాలి.' హఠాత్తుగా అతనిగొంతు గంభీరంగా మారిపోయింది. 'పెళ్ళి అయ్యాక మనిద్దరం కలిసివున్నది ఆరేడు రోజులే — అప్పుడే చెప్పటానికి నువ్వేమనుకుంటావో అని జంకాను...రా అలా కూర్చుందాం.' అంటూ చేయి పట్టుకుని మంచం దగ్గరికి తీసుకెళ్ళాడు. సంభ్రమం, కుతూహలం నింపుకున్న కళ్ళతో 'అదేమిటి చెప్పండి.' అన్నట్లు చూసింది.

ఏదో చెప్తాను అని అనేశాడే కాని తీరా అసలు విషయం ఎలా ప్రస్తావించాలో అతనికి అర్థం కాలేదు ఒక్కక్షణం — చివరికి అన్నాడు.

'అసలు నాకు ఇప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోటం ఇష్టంలేదు.' — 'ఓస్ — ఇదేనా.' అన్నట్టు చూసింది యశోద. ఆమాట వింటూ 'నాకు తెలుసు.' ఎంతమాత్రం ఆసక్తిలేనట్లు నిదానంగా సమాధానం చెప్పింది నవ్వు దాచుకుంటూ —

'ఎవరు చెప్పారు'

'...సీతారామయ్యగారు అన్నారని మా నాన్నగారు వాళ్ళూ అనుకుంటూంటే విన్నాను.'

'అయితే కారణం ఏమిటో నేను ప్రత్యేకించి చెప్పక్కర్లేదన్నమాట.' అని.

'చూడు కొద్దినెలల్లో సుందరం చదువయిపోతుంది. వాడికి పెళ్ళయి ప్రవాసం. శశికికూడ చదువులూ పెళ్ళిళ్ళూ అయేనాకా మనిద్దరిమీద కాస్త బాధ్యత ఎక్కువే వుంటుంది — ఈ బాధ్యతలన్నీ నామీద పెట్టి నాన్నగారు నిశ్చింతగా కళ్ళుమూశారు వాటిని నిర్వహించటంలో ఎలాంటి లోటు రాకూడదనే నా కోరిక. అందుకే పరిస్థితులన్నీ ఓ దారిలో పడేదాకా అసలు పెళ్ళిమాటే తలపెట్టదలుచుకోలేదు. సరే అమ్మ మాట కాదనలేక నిన్ను చూడటానికి వచ్చా ననుకో — ఇంక చూసింతరువాత



వద్దు అనటం నాతరం కాలేదు.'

ముసిముసిగా నవ్వుకుంది యశోద, తల వంచుకుని దుప్పటి కొసలు మెలిపెడుతూ.

'ఇప్పుడు తీరుబడిగా కూర్చోపెట్టి నీకేదో నీతిబోధలు చేస్తున్నాననుకోకు— కాని నువ్వు అన్నివిధాల నాతో సహకరించాలి—మరుదులని ఆడబిడ్డలనీ వదినలా కాకుండా కన్నతల్లిలాగే ఆదరించాలి— ఈ కుటుంబంలో మనవల్ల ఎలాంటి కలతలు రాకూడదు. అంతేకాదు అవసరం అయితే చిన్నచిన్న త్యాగాలు చెయ్యటానికి కొన్ని ఇబ్బందులని వోర్చుకోటానికి నువ్వు అలవాటుపడాలి — ఇంక ఇంటి బాధ్యత అంటే నీకు పూపిరి సలపని చాకిరీ ఏమీ వుండదు— అమ్మ సంగతి గ్రహించుకున్నావుగా— నిన్ను కన్న కూతురిలాగే చూసుకుంటుంది. కొంతమంది అత్తగార్లలా నిన్ను కోడరికం పెట్టటం అదీ ఏమీవుండదు — ఇంక నా విషయం నీ మనస్సుకి ఏవిధంగానూ కష్టం కలగకుండా చూడటానికి నాకు చేతనయినదంతా చేస్తాను—పిల్లలు వదినా వదినా అంటూ నీవెంట తిరుగుతూనే వున్నారుకదా— ఒకవేళ చిన్నతనంచేత వాళ్లవల్లేదయినా పొరపాటు జరిగినా నువ్వు సర్దుకుపోవాలి— నేను చాలా చాదస్తంగా చెపుతున్నాను కదూ...' చెప్పటం ఆపి భార్య కళ్లలోకి లోతుగా చూడబోయాడు.

అంతవరకూ చలనంలేని బొమ్మలా కూర్చుండిపోయిన యశోద తలతిప్పి మెల్లిగా అంది. 'మీరింతగా చెప్పక్కర్లేదు మీ బాధ్యత నా బాధ్యత కాదా—అన్నివిధాల మీకు తృప్తి కలిగేవిధంగా నేను మసులుకుంటాను— నేను మాట ఇస్తున్నాను— నన్ను నమ్మండి.'

'నాకు చాలా సంతోషంగా వుంది—నీరాక వల్ల నాలో ఏదో మార్పు వచ్చిందనీ, ఈ సమిష్టి కుటుంబంలో వడిదుడుకులు ఏర్పడ్డాయనీ ఇంట్లోవాళ్లు కాని బయటివాళ్లు కాని అనుకోటానికి ఎలాంటి ఆస్కారం కలగకూడదు' అన్నాడు అనునయంగా భార్య చెంపలు నిమురుతూ.

'అలాంటి భయాలు ఏమీ మీకు అక్కర్లేదు— ఇంతకన్నా ఇంకా ఎలా చెప్పాలో తెలియటంలేదు' యశోద కళ్లు దీనంగా చూశాయి.

'నా ఖర్మాలతో నిన్ను పాడుగొట్టేసి నట్టున్నాను కదూ' నవ్వుతూ దగ్గరికి తీసుకున్నాడు ముకుందం.

* * *

పరీక్షా ఫలితాలు తెలిసే రోజులు వస్తున్నాయీ అంటే పిల్లలున్న యింట్లో అదొరకమైన సందడి ఆరాటం వుండక మానదు. అందులో అవి పబ్లిక్ పరీక్ష అయితే ఇంక ఆ హడావిడి చెప్పక్కర్లేదు.

తనలో తనకీ ఇంట్లో వాళ్ళకీ ఎంత నమ్మకం వున్నా వ్యతిరేకముఖంగా ఆ వార్త తెలుసుకునేదాకా సుందరం మనస్సుకి కాస్త కూడ స్థిమితం లేనట్లే వుంది.

తన నెంబరు పేపర్లో చూసుకుంటూంటే ఆనందాతిరేకంతో అతని కళ్ళు చెమ్మగిల్లిపోయాయి. తను బి. ఇ. అయ్యాడు— కోరుకున్నది సాధించగలిగాడు.

'నిజంగా నీ ప్రోత్సాహం సహకారం లేకపోతే నేనింతటి వాడిని కాలేకపోయే వాడిని.' అన్నాడు అన్నగారి వంక కృతజ్ఞత వుట్టిపడే కళ్ళతో చూస్తూ.

'నలుగురూ నాలుగు రకాలుగానూ అన్నప్పటికీ, సాహసించి పెద్ద చదువులో పెట్టినందుకు, ఒక్క ఏడాదయినా పోవకుండా డిగ్రీ సంపాదించుకున్నావు—నాకెంత సంతోషంగా వుందో చెప్పలేను ...' అన్నాడు ముకుందం ఆప్యాయంగా తమ్ముడి భుజం నిమురుతూ.

'సమయానికి చేతిలో డబ్బులేక పోయినా ఇక్కడా అక్కడా తెచ్చి సర్దుబాటు చేసి పంపించినందుకు పదిమందిలోనూ నా మాట దక్కించావు—' అంది సుభద్రమ్మ గారు గర్వంగా కొడుకుల వంక చూసుకుంటూ.

తనతోపాటే ఇంటరులో క్లాసు తెచ్చుకుని బి. ఇ. చదవటానికి వచ్చిన శేషగిరీ, మురళీలను దృష్టిలో పెట్టుకునే వాళ్ళ మాటలంటున్నారని గ్రహించుకున్నాడు సుందరం — మరి కాస్త శ్రద్ధ పెట్టి చదివి వుంటే వాళ్ళూ ప్రతి ఏడూ పోనయేవాళ్ళే.' అనిపించింది.

'సాయంకాలం వెళ్ళి జగన్నాథంగారికి కనిపించి వద్దాం— ఆయనకి నీ నెంబరు తెలుసనుకో—అయినా మనం వెళ్ళి చెప్తే ఆయన సంతోషిస్తాడు — మర్యాదగానూ వుంటుంది...తరువాత నువ్వు షాపుకి వస్తే విశ్వనాథంగారికి కూడ చెప్పేసి అటు

# ఆశలూ అనుభవాలూ

నుంచి ఇద్దరం వాళ్ళింటికి వెళ్దాం' అన్నాడు ముకుందం.

వాళ్ళ సందడికి హడావిడికీ అసలు సంగతి గ్రహించుకుని సరదాగా ఆ ఖబుర్లు వింటూ గడప వారే నిలబడిపోయిన వదిన గారిని చూస్తూ అన్నాడు సుందరం—

'నేను ప్యాసయ్యాను వదినా...'

'విన్నాను—చాలా సంతోషంగా వుంది' అంది యశోద అభిమానంగా నవ్వుతూ.

'ఇలా వచ్చి కూర్చోవమ్మా — ఎవరి దగ్గరా నీకంత సిగ్గు' నవ్వుతూనే వెక్కిరింతగా అంది శశి—

'ఇవాళ నాన్నగారుంటే ఎంత సంతోషించేవారో,' స్వగతంలా అనుకోబోయి కాస్త పైకే అన్నాడు ముకుందం — అక్కడ వున్న అందరి మనస్సులలోనూ అదే భావం మెదులుతోంది.

'ఏం చేస్తాం—ఆయనకి ప్రాప్తం లేక పోయింది మరి— ఆ లోటు కనిపించనీయకుండా ఆయన కలలని నిజం చేశావు నువ్వు.' అంది సుభద్రమ్మగారు చెమర్చిన కళ్ళు పిల్లల కంట పడకుండా ఎటో చూస్తూ.

'బాగుంది— నేను చేసిందేముంది—' ... తమ్ముడిని 'ఇంతటివాడిని చెయ్యగలిగాను అనే సంతోషం, గర్వం, ఒక ప్రక్క




నుంచి పొంగిపొర్లుతున్నా తన గొప్ప తనే చెప్పుకోటం ఇష్టంలేని వాడిలా మెల్లిగా అన్నాడు ముకుందం.

'అలా అనకన్నయ్యా — నువ్వు నాకీ అవకాశం కల్పించకపోతే ఏదో డిగ్రీ సంపాదించుకుని, దాంతో దొరికిన వుద్యోగంతో సరిపెట్టుకోవలసివచ్చేది — నాతో పాటు ఇంటరు చదివిన రాజా, సూర్యారావు వాళ్ళని చూస్తుంటే నా కెప్పుడూ అలాగే అనిపిస్తూ వుంటుంది — వాళ్ళకీ నాలాగే తెలివితేటలున్నాయి, చదువుకోవాలనే ఆసక్తి వుంది. అయితేనేం పరిస్థితులు కలిసిరాలేదు— ఇంక ఏంచేస్తారు. గుమస్తాలుగా స్థిరపడిపోయారు...నిజంగా నీ అభిమానం నేను ఎప్పుడూ మరచిపోలేను... సుందరం గొంతు మరీ మెత్తగా ఆర్ద్రంగా మారిపోయింది.

'సరిపోయిందిలే — నిన్ను నేనూ నన్ను నువ్వూ పొగుడుకుంటూ కూర్చుందాం ఇవాళంతా ... లేవమ్మా నాకు వేళయింది, వడ్డించు' అంటూ లేచాడు ముకుందం. తీయని అనుభూతితో నిండిపోయిన మనస్సు ఎవరిముందూ బయటపడిపోకుండా సహజంగా మాట్లాడేస్తూ.

అందరూ లేచి వంటగదివేపు వెళ్తుంటే 'అన్నయ్యా' అంటూ ప్రకాశం చిన్నన్నగారిని మెల్లిగా పిలిచాడు — సుందరం వెనక్కి తిరిగి ఏమిటది అన్నట్లు చూశాడు.

'నేనోటి అడుగుతాను, ఏమీ అనుకోకేం—'

'ఏమిటది' తమ్ముడి ధోరణికి నవ్వొచ్చింది. అయినా అంతగా అనుకునే విషయం ఏముంటుందో అతనికి తోచలేదు.

'నీ చదువయిపోయింది కనక నీ పెన్ను నాకియ్యి. నా పెన్నేం బాగా రాయటం లేదు— కాలేజీలో చేరేసరికయినా మంచి పెన్ను లేకపోతే...' మనస్సులో మాట కాస్త నసుగుతూనే బైటపెట్టేశాడు.

'అలాగేలే— కాని ఒక్కషరతు— నాకు వుద్యోగం దొరికేదాకా నేను వాడుకోటానికి ఇస్తూండాలి మరి. నాచేత బాగా పరీక్షలు వ్రాయించిన ఈ పెన్నుతోనే ఉద్యోగాలకి అప్లికేషన్లు పెట్టుకోవాలని.'

'ఓ—ఎందుకివ్వనూ' ఎగిరి గంతేశాడు ప్రకాశం.

(ఇంకావుంది)

# క్రమశిక్షణా? కొట్టుడు తినడమా?

కె. కామలక్ష్మి



పక్కింటావిడ ఆదివారం పూటా ఉదయాన్నే ప్రారంభించింది—పిల్లల్ని చక్కదిద్దడం. అదేం చక్కదిద్దడమో తెలియదుగాని ఇరుగుపొరుగువారికి అందరికీ ఆందోళన ఎక్కువ అవుతుంది. ఇదే విదేశాల్లో అయితే 'పిల్లలపట్ల క్రౌర్యం చూపరాదు' అంటూ అట్టలు పట్టుకు వాలంటీర్లు ఇంటిచుట్టూ మూగేవారేమో అనిపిస్తుంది. ఇంకెప్పుడూ చెయ్యను బాబోయ్, కొట్టకు బాబోయ్ అంటూ ఇంటిచుట్టూ పరుగులు పెడుతున్నాడు వాళ్ళబ్బాయి. మరీ చిన్నవాడూ కాదు, మరీ పెద్దవాడూ కాదు. పన్నెండేళ్ళవాడు. ఆదివారం తెల్లవారుఝామునే ఏమంత తప్పుచేశాడు చెప్మా? అని గోడ దగ్గిరకి వెళ్ళాను. నన్నుచూసి పిల్లవాడ్ని తరమడం ఆపి 'చూడండి మామీ' అంటూ చేతిలో జూక వూపుతూ వివరణ మొదలు పెట్టింది. అన్నిటిలోనూ మార్కులు తక్కువ వచ్చాయిట. పొద్దుటే లేచి చదువుకోమందిట. కాస్సేపుపోయి వచ్చిచూస్తే యింకా పడుకునే ఉన్నాట్ట. ఒళ్ళు మండుతుందా లేదా చెప్పమని నిలవేసింది. 'ఆదివారమే కదండీ' అన్నాను అయితే వీడి పనొక్కటేనా నాకు! అంటూ నన్ను కసురుకుంది. ఇంతట్లో యీ పంచాయితీ నీ కెందుకంటున్నట్టు మావారు కేక వేశారు. నేనూ అక్కణ్ణుంచి కదలగానే మళ్ళీ కుర్రవాణ్ని తరమడం ప్రారంభించింది.

ఇది చూస్తే నాకోసంగతి జ్ఞాపకం వచ్చి నవ్వొచ్చింది. నాకింకా పెళ్ళి కాకుండానే పెద్దకొడుకుని పెంచుకోవడం ప్రారంభించాను. వాడ్ని ఓ అవతార పురుషుణ్ని చేయవలసిన బాధ్యత నాదని ఏదో బరువు! రోజూ వాడి ప్రాణాలు తోడేదాన్ని — చదవమని. ఉట్టినే ఉంటే కాపీ రైటింగు వ్రాయమని, ఆడుకుంటున్నప్పుడుకూడా—సరదాగా ఎక్కాలు చదువుకోమని! ఓరోజు సాయంత్రం కూర్చోపెట్టి ఇంపోజిషన్ రాయిస్తున్నాను — 'ఇంకెప్పుడూ ఇలా చెయ్యను' అని—వంద సార్లు రాయించాలని నా పట్టుదల. ఇంతట్లో ఆయన వచ్చారు. 'ఏమిటి శిక్ష' అంటూ ఆయన సహజ ధోరణిలో నవ్వేరు. నాకు కోపంగా ఉండి 'లెక్కలు చెయ్యకుండా వెళ్ళిపోయాడు అందుకే యీ శిక్ష' అన్నాను ఆయన చాలా కూల్‌గా 'పోనీ కూర్చోపెట్టి ఆ లెక్కలే చేయించ కూడదా?' అన్నారు. నాకు చచ్చేటంత నవ్వొచ్చింది—నిజమేకదా? మరి! ఆరోజు మొదలు క్రమశిక్షణపట్ల చాలా నిశ్చింత అలవరచు కొన్నాను.



చెప్పొచ్చే దేమిటంటే—ఎందుకు శిక్షిస్తున్నాం అన్నది తెలియనప్పుడు శిక్షించి ప్రయోజనం ఉండదు. అది కొట్టుడు తినడమే అవుతుంది. పిల్లలు చెప్పినమాట వినకపోతే శిక్షించాలి. కాని ఎందుకు శిక్షిస్తున్నాం అన్నది వాళ్ళకి తెలిస్తేనే — ప్రయోజనం ఉంటుంది.

రోజూ ఒక రొటీన్ అలవాటుచేయాలి పిల్లలకి. అప్పుడే కూర్చోపెట్టి చదివించడం పని ఉండదు. వాళ్ళ 'ఇంటిపని' మనం చేసే అవసరం ఉండదు. కొందరు తల్లులు చక్కగా హోంవర్కులు చేసిపెడతారు. ఇంకా కొందరు — ట్యూషన్ మాష్టర్లు అందుకే ఉన్నారనుకుంటారు. పిల్లలకి తమబాధ్యత తమకి అర్థమయ్యేలా తెలియచెప్తే కష్టపడి పేనుబెత్తానికి పనిచెప్పే అవసరం ఉండదు. రోజూ స్కూలుకి వెళ్ళవలసిన వాళ్ళకి రోజూ ఎక్కడ చెప్పగలం—వారికా సంగతి తెలియాలిగాని.

స్కూలుకి వెళ్ళొరాగానే కాస్సేపు విశ్రాంతి—తరువాత మరునాటి పని చూసుకోవాలి. పుస్తకాలు సర్దుకోవడం అలవాటవాలి. ఓ పూట సెలవువస్తే కాస్త ఆటూ యిటూ స్వేచ్ఛగా పిల్లల్ని ఉండనివ్వాలి. సాయంత్రానికి వాళ్ళకే తడుతుంది—కూర్చొని పుస్తకాలు చూడాలని... ఈ అలవాట్లు నెమ్మదిగా పిల్లలకి అలవాటుగా మారాలేగాని రాసిరంపాన పెట్టి వంటపట్టించేవి కావు. నిజమైన అభిరుచి తమ పాఠ్యవిషయాలలో కలగచేస్తే పిల్లలు వద్దన్నా శ్రద్ధగా చదువుకుపోతారు.

మరీ చిన్నపిల్లలని కఠినంగా శిక్షించడంలో అర్థంలేదు. వారి చిరుమనస్సుల్లో పాఠాలంటే భూతాలన్న అభిప్రాయం ఏర్పడ్డం మినహా మనం ఏం సాధించలేం.

(64వ పేజీ చూడండి

# భీమభటుని వృత్తాంతం



## క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

మృగాంకదత్తుడు మిత్రులతో పాటు మళ్ళీ యాత్ర సాగించాడు. దారిలో ఘోర మయిన మరొక అడవి అడ్డు తగిలింది. ఆ వనం చీకటిచెట్లు తాటిచెట్లు మొద అయిన నల్లటి మానులతో దిక్కులను నల్లగా చేస్తున్నది. సూర్య మండలానికి అడ్డుతగిలే ఎత్తైన నల్లటి మానులతో ఇంద్రనీల శిలాస్తంభాలతో కట్టిన చీకటి మందిరంలాగను, నెమళ్ల పొడుగాటి తోక లతో నల్లగావుంటూ, భూదేవి కేశపాశం లాగ నల్లగాను కనిపించింది ఆ వనం.

అక్కడ ఒక గుబురుగా పెరిగిన పొద రింటిలో ఒక పెద్ద ఏనుగులరాజు కని పించాడు. ఆ ఏనుగు మృగసంఘాలకే సంకేత స్థానంగా వున్నట్టు అనిపించింది. ఆ ఏనుగు మనుష్యులలాగ మాట్లాడుతూ ఎదుట నిలబడిన ఒక గుడ్డివాడికి పళ్ళు, నీళ్ళు ఇచ్చి వోదారుస్తూ వున్నది.

మృగాంగ దత్తుడు ఆ గజ, మనుష్యుల అపూర్వ సంలాపం విని, ఆ సన్నివేశం చూచి ఆశ్చర్యపడి మిత్రులతో ఇలా అన్నాడు:

'మిత్రులారా! ఏమిటో ఇది ఆశ్చ ర్యంగా వుంది. ఏనుగొక గుడ్డివాడిని గౌర విస్తున్నది; బంధువులాగ ప్రేమతో పళ్ళు నీళ్ళు అతనికి ఒదిగిస్తున్నది. వాడేమో మన మిత్రుడు ప్రచండశక్తి పోలికలలో వున్నాడు. అతడేనేమో! వాళ్ళు ఏమి మాట్లాడుతారో విందాము.'

మృగాంకదత్తుని మాట ప్రకారం వారంతా తీగలవెనుక దాక్కుని గజ మానవ సంభాషణను వినడానికి చెవులు దోరపెట్టు కొని వున్నారు.

ఏనుగు ఆ గుడ్డివాడికి నమస్కారం చేసి ఇలా అన్నది: ఆర్యా, నేను జన్మాం తరంలో రాజపుత్రుడిని. నా సోదరుణ్ని చంపుదామనే సంకల్పంతో ప్రయత్నం చేశాను. త్రినేత్రుడు కోపంతో నన్ను ఏనుగు కమ్మని శపించాడు. నీవు అతిథివి. కనుక పూజనీయుడివి. నీ సంగతి చెప్పు.'

అంధుడు గద్గద కంఠంతో యిలా అన్నాడు: 'గజేంద్రా, నేను మృగాంక దత్తుని మంత్రిని, పదవవాడిని. నా పేరు ప్రచండశక్తి. నాగరాజు శాపంతో నాకు ఈ దుర్దశ వచ్చింది. నీ సంగతి వివరంగా చెప్పు.'

ఏనుగు దుఃఖంతో ఒకసారి తొండంతో ఘాత్కరించి ఇలా అన్నది:

రాఢా అనే నగరం ఉంది. దానిని ఉగ్ర భటుడనే రాజు ఏలేవాడు. వానికి సుందరి అయిన భార్య వుండేది. ఆమె పేరు మనోరథ.

ఒకసారి అతని ఆస్థానానికి నానాదేశ సంచార చతురుడయిన ఒక వర్తకుడు వచ్చాడు. అతని పేరు కాలకుడు. అతని కుమార్తె లాసిక అనేది నృత్య నిపుణు రాలు. ఆ రాజు ముందు నృత్యం చేసింది, లక్ష్మి వేషం ధరించి.

'ఈమె పలుసారు అమృతహరణం చేసి వుంటుంది, లేకపోతే తన లావణ్యంతో ఇత

రుల కళ్లను అమృతంతో ఏలా చల్లబరుస్తుంది' అని రాజు అనుకున్ని ఆమెను తన ప్రియురాలుగా చేసుకొన్నాడు. సంపదల పొరం ఇంతే. అది కామానికి అడ్డురాదు. లావణ్యోత్పన్న శీల అయిన ఆ వాసికను ఎప్పుడూ రాజు కౌగిలించుకొని వుంటూ హాలా మదమత్తుడయి వనమాల ధరించిన బలభద్రుడిలాగ వుండేవాడు.

రాజు పుత్రకామేష్టి చేయగా, కాలక్రమాన మనోరధాదేవికి భీమభటుడనే వాడు, లావికకు సమరభటుడనే శూరుడు పుట్టాడు. వారిద్దరూ భీమ దుర్యోధనుల వలె అసూయాగ్రస్తులయా. కలలోను, శస్త్రాస్త్ర విద్యలలోను భీమభటుడు గొప్పవాడయాడు. మాతృసౌభాగ్యంవల్ల రెండవ వాడు సమరభటుడు తండ్రికి చాల ఇష్టుడయ్యాడు.

వారిద్దరూ ఒకమారు ఆటల్లో పోట్లాడుకున్నారు. భీమభటుని దెబ్బకు సమరభటుని తల పగిలి రక్తం కారింది. లావిక దానిని చూచి రాజుకు దూరుచెప్పింది. రాజు కోపగించి, భీమభటుణ్ణి అంతఃపురంనుంచి వెళ్లగొట్టి తక్కినవారిని తన చిన్నకుమారునికి చెలికాండ్రుగా చేశాడు.

భీమభటుడు దుఃఖంతో, నివురుగప్పిన నిప్పులాగ కుమిలిపోతూ వుండగా, రాజపుత్ర పరివృతుడయిన సమరభటుడు గర్వాంధుడయి అతనిని—భీమభటుణ్ణి—అవమానించాడు.

భీమభటునికి శంఖదత్తుడనే బ్రాహ్మణుడు స్నేహితుడు. వారిద్దరి మనస్సులు పరస్పరం ప్రతిబింబించినట్టు వుండేవి.

ఒకమారు దేశాంతరంనుంచి ఒక గుర్రాలవర్తకుడు వచ్చాడు. అతనివద్ద ఇంద్రుని వుచ్చైశ్రవంలాగ ఉన్నతంగాను, మరచిపోయిన తన బలదర్పాలలాగ ఉదాత్తంగాను, సంకల్పాంలాగ వేగంగలదిగాను వుండేది. దానిని భీమభటుడు వెలకు కొన్నాడు.

సూర్యమండలంనుంచి బడబను కామించడానికి దిగివచ్చినట్టున్న ఆ అశ్వరాజాన్ని చూసి, లావికాపుత్రుడు గర్వంతో 'ఇది నాదే' అని లాక్కుపోవడానికి వచ్చాడు. భీమభటుడు శంఖదత్తుడు తోడురాగా సమరకుని పరివారంతో పోరాడి, సుభటులను పరిమార్చి చంపదగినప్పటికీ అన్న తమ్ముణ్ణి చంపకుండా వదలిపెట్టాడు. కాని, తండ్రిభయంతో మిత్రునితోపాటు గుర్రమెక్కి దేశంవిడిచి పారిపోయాడు. తల్లి మనోరధ అతనికి దారిఖర్చుకోసం తన రత్నాభరణాలిచ్చింది.

భీమభటుడు, శంఖదత్తుడు గుర్రాల మీద సవారిఅయి వెళ్లుతుండగా దారిలో పెద్ద అడవి వచ్చింది. ఆ అడవి మహా భయంకరంగా వుంది. సింహాలు గుర్రులు పెట్టి నిద్రపోతున్న గుహలముందు నడవడానికి ఏనుగులు సంకోచపడుతున్నాయి.

ఆ భయంకరమయిన అడవిలో వారి గుర్రాల డెక్కలచప్పుళ్లకు పులులు నిద్ర మేల్కొన్నాయి, వారిమీదపడి వారి గుర్రాలను చంపివేశాయి. శంఖదత్తుడు మిత్రునికి కొసటగా నిలిచి, ఊరడించాడు. ఇద్దరూ కాలినడకన వెళ్లుతూ, అడవి దాటి గంగఒడ్డు చేరారు. తెల్లవారింది. అలసిపోయారు. అక్కడ వారికి నీలకంఠుడనే వ్రతి కనిపించాడు. ఆ వ్రతి యువకుడు; కాని, వృద్ధునిలాగ వ్రతాలు చేనుకుంటున్నాడు. భీమభటుడు 'ఎందుకిలా వున్నావు?' అని అడిగాడు అతనిని. 'నేను ధనంలేనందున ఇలా బాధపడుతున్నాను. అందువల్ల గృహస్థాశ్రమం తీసుకోలేదు' అన్నాడు ఆ వ్రతి. భీమభటుడు అతని మాటలువిని, తనవద్దవున్న రత్నాభరణాలు అతనికిచ్చి మిత్రునితో సహా గంగానదిని దాటి వెళ్లడానికి పూనుకున్నాడు.

గంగానది మరుగులపిండుతో, అట్టహాసం చేస్తున్నట్టు, తరగలనే చాపుదండాలతో తాండవం చేస్తున్నదానిలాగ వుంది. వారిద్దరూ నీటిలోదిగి తమ దండలు ముందుకువేస్తూ, ఈదుతూ, వెళ్లారు. తమదండల రత్నభూషణాల కాంతితో నీటిని చిత్రవిచిత్రంగాచేస్తూ, కుండలాల నీలరత్నాల కాంతితో తరచు మరింత నల్లగా కనిపించే పాచితీగలను లాగి పారవేయడానికి చేతులు విసురుతున్నారా అన్నట్టు అని అనిపించింది, వారు ఈదుతూవుంటే.

కొంతసేపు ఈదేవేళకు మంచుపిండాల లాగ తెల్లగను, పుష్కలావర్తక మేఘాల వలె మహా వేగవంతమయిన పెద్దపెద్ద తరగలు శంఖదత్తుని భీమభటునినుంచి వేరుచేసి ప్రవాహంలో [illegible] చేశాయి. భీమభటుడు మిత్రుణ్ణి [illegible] సహచర చక్రవాకం పోయిన చక్రవాకం లాగ దుఃఖాంధకారమయుడయి అవతలి గట్టు చేరాడు.

మిత్రుడు సంపదలున్నకాలంలో క్రీడా మందిరం వంటివాడు; దుఃఖాలలో ఆశ్రయంవంటివాడు: రహస్యవర్చలకు కోశాగారం వంటివాడు; మిత్రుడంటే మర్త్యులకు మరేమీకాదు!

భీమభటుడు మిత్రవియోగ దుఃఖంతో నీళ్లలోపడి మరణించాలనుకున్నాడు. ప్రియమిత్రుల విరహాన్ని ధీరులుకూడా సహించలేరు. అప్పుడు సాక్షాత్తు గంగాదేవి, కాంతితరంగాలను వ్యాపింపజేస్తూ, అతనికి ప్రత్యక్షమై 'పుత్రా, ఈలాటి ప్రాణత్యాగ సాహసం చేయవద్దు. మిత్రుణ్ణి మళ్లీ కలుసుకుంటావు. నీకు ప్రతిలోమనులోమ అనే దివ్యవిద్యను నీకు అనుగ్రహిస్తున్నాను. దీనివల్ల మానవులు కామకోరినరూపంతో సంచరించగలరు.' ఇలా అంటూ గంగాదేవి తన దంతకిరణాలతో దిక్తటాలను తెల్లనిగాచేస్తూ, స్వేచ్ఛాకృతిప్రద అయిన ఆ ప్రతిలోమానులోమ విద్యను అతనికి ఉపదేశించింది.

ఆ విద్యాబలంతో భీమభటుడు ధైర్యమే సహాయంగా ఉత్సాహమనే రథం ఎక్కి బయలుదేరాడు. వెళ్లుతూ వెళ్లుతూ సకల సంపదలకు నిలయమైన లాటదేశం చేరాడు.

లాటదేశ రాజధానిలోని అక్కడ ఒక జూదర్ల ఇల్లు చూచాడు. అతను ఆ ద్యూత గృహానికి వెళ్లుతూంటే, లాట అలసులు వింత అందగాడే అని చూచారు. ఆ కలుపకంటి చూపులతో అతనికి కలువల దండలు మెడలో వడినట్లయింది.

ద్యూత గృహంలో కొందరు ఓడిపోయినవారు మోకాళ్లపై చెంపలు ఆనిందా నిశ్చల దృష్టితో ఏదో ఆలోచిస్తున్నారు. కొందరు హాహాకారాలు చేస్తూ అరచేతితో నేల చరుస్తున్నారు. కొందరు ఎదిరిని ఆక్షేపిస్తున్నారు. మరి కొందరు ఏవేవో ప్రతిజ్ఞలు, శపథాలూ చేస్తూ అదిరిపోతున్నారు. మరికొందరు మూతి విరుస్తున్నారు. కన్ను గీటుతున్నారు. గళగళ మాట్లాడుతున్నారు. పాములలాగ

[illegible] డుతున్నారు. పారధులలాగ దూశి కొసతులుగాము, పిచ్చివాళ్ళలాగ గుడ్డలు లేకుండాము, వ్యసనాలలాగ అందరి ఈసడింపులకు పాత్రంగాను ఉన్నారు, జూదగాళ్ళు.

భీమభటుడు వినోదం కోసం అక్కడ జూదమాడి, అందరినీ గెలిచాడు. గెలిచినా, గెలిచిన డబ్బును వాళ్ళకే ఇచ్చివేశాడు. అతడు ఇతరుల సొమ్ము తీసుకోడంలో శిక్షణ పొందినవాడు కాడుమరి! 'మేము యాచకులమా? నీ డబ్బు తీసుకోము' అని వారన్నారు.' కాని మీరంతా నా మిత్రులు, మిత్రుని ధనం తీసుకోండి' అంటూ భీమభటుడు ఆ డబ్బు వారికే అప్పగించాడు. వారిలో వసుదత్తుడనేవాడు భీమభటునికి అత్యంత మిత్రుడయ్యాడు.

భీమభటుడు అడగ్గా అతడు తన సంగతి ఇలా చెప్పాడు: హస్తినాపురంలో శివదత్తుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు: అతని కుమారుణ్ణి నేను. నాపేరు వాసుదత్తుడు. నేను చిన్ననాడే దురభ్యాసాలకు లోనయ్యాను. నాతల్లి నిరంతరం కలహాలు. దానికి నాతండ్రి విసుగెత్తి దేహాన్ని గేహాన్నివదలి వెళ్ళిపోయాడు.

నా తండ్రిపోయిన తర్వాత కోపిష్ఠురాలయిన నాతల్లి నా భార్యను పరుషాలాపాలతో బాధపెట్టసాగింది. నవ్వుతూ మాట్లాడితే కులట అని, మౌనంగా ఉంటే, ఎంత పొగరమ్మా అని, శ్రమపడి పనిచేస్తే, సుఖంకోసం పనిచేస్తున్నదని, నీతో ప్రవర్తిస్తే ఏదో మాయపన్నింది అని, భయభక్తులతో ప్రవర్తిస్తే, ఏదో కపటవేషమని, సేవచేస్తే, మోసగించదలచిందని కోడలిని అనుక్షణమూ దోషాలే వెదకుతూ బాధపెట్టసాగింది. ఆ దుఃఖంతో నా భార్య ఎక్కడికో వెళ్ళిపోయింది. నిరంతరం ఎవరు వ్యధపడతారు?

తర్వాత నేను మిత్రుల మాటవిని ఒలాక కన్యను పెళ్ళిచేసుకున్నాను. దుష్టురాలయిన నా ముసలితల్లి మునుపటి పద్ధతితోనే, ఆమెను కూడా ఇంటినుండి వెళ్ళగొట్టింది. మిత్రులు నన్ను మూడో పెళ్ళి చేసుకోమని కోరారు.

నేను ఓ విచిత్రమయిన పనిచేశాను. కర్రతో ఆడబొమ్మను చేయించి ముసుగు వేసి ఓ గదిలో మూల కూర్చోబెట్టాను. నేను ఇల్లు కదిలిన తర్వాత, నా తల్లి కోడలూ ఒంటరిగావున్నదని దగ్గరికి వెళ్ళి పోట్లాడదలచింది. ఎంతసేపటికీ కోడలు జవాబు చెప్పలేదు. అంత గాంభీర్యమేమిటని ఆమెకు శంక కలిగింది. నన్ను ఏడిపిద్దామని తన వంటినిండా రక్తం పూసుకుని ఏడుస్తూ 'అయ్యో ఎవరులేకుండా ఒంటిగావున్న నన్ను తన్నింది, కొట్టింది' అని కేకలు వేసింది.

నేను వెళ్ళాను. నా మిత్రులు, బంధువులు వచ్చారు. 'ఏదీ? మీ కోడలు ఏదీ?' అని అడిగారు. 'అదుగో గదిలో మూలలో' అని నా తల్లి దూరంనుంచి చూపింది. వారు దరికి వెళ్ళి ముసుగుతీశారు. కర్రబొమ్మ. అందరూ విరగబడి నవ్వారు.

నేను నాతల్లి నిరంతరం నన్ను పరుషవాక్యాలతో వేగిస్తుండగా సహించలేక దేశం వదలి, స్వర్గభోగాలున్న ఈ దేశానికి వచ్చాను. ఇక్కడ జూదంలో నాకు ఓడిపోయిన వారంతా నాకు ప్రియమిత్రులు, అనుచరులు అయ్యారు. వీరోచండుడు, భుజంగుడు మొదలయినవారు. వీరంతా చాల సాహసవంతులు.—

భీమభటుడు వసుదత్తుని సంగతి విని సంతృప్తిగా అక్కడే ఉండిపోయాడు. గుణసంపన్నులయిన గొప్పవారికి ఏవూరే స్వంత ఊరు.

ఇలా వుండగా వర్షాకాలపు వరదలకు విపాశా నదిలోకి ఏనుగువంటి ఒక చేప కొట్టుకొని వచ్చింది దానిని ధీవరులు వలలతో పట్టుకున్నారు దానిని చూడడానికి అందరు కోలాహలంగా వెళ్తున్నారు. భీమభటుడుకూడా అక్కడికి వెళ్ళాడు. కొంబడివారు దాని పొట్టను కోశారు. ఆ పొట్టనుండి శంఖదత్తుడు బయలుదేరి వచ్చాడు.

భీమభటుడు అదిచూచి ఆశ్చర్యపడ్డాడు అచింతితంగా ఈ సంఘటన జరిగింది. 'ఏమిటిది? ఎలావచ్చావు ఈ చేపకడుపులోకి? అని అడిగాడు అతని ఆలింగనం' చేసుకుంటూ.

'ఈ జలచరం నన్ను గంగానదిలో మింగివేసింది. దాని కడుపులోనే వున్నాను. ఇప్పుడు కొంబడివారు దానికడుపు కోయడంవల్ల బయటపడ్డాను. దైవానికి ఏది దుర్ఘటం! కష్టాలు గడచి నిన్ను కలుసుకోగలిగాను' అని శంఖదత్తుడు తన సంగతి చెప్పాడు. భీమభటుడు తనసంగతి తన మిత్రునికి చెప్పాడు. వారిద్దరు ఆ ద్యూత గృహంలోనే సుఖంగా ఉన్నారు.

ఆ నగరంలో నాగయాత్రా మహోత్సవం జరిగింది. అప్పుడు, ఒక కన్యక తన సహచరీ సర్గంతోపాటు స్నానానికి వచ్చింది. ఆ కన్యక చంద్రాదిత్య మహారాజా కూతురు. పేరు హంసావళి. కాకచంద్రుడు తన తారా పరివారంతో తరలి వచ్చినట్టు యుంది. ఆ కన్యక తన తరల లోచనచ్ఛాయలనే లేఖినులతో ప్రజల సంకల్పాలనే తెరలమీద మన్మథ రూపాలు రచిస్తున్నట్టు అనిపించింది. చంద్రుడు వందసార్లు సంకల్పించి, వందసార్లు ప్రయత్నించి కాంతి స్ఫటికాలతో గండరించిన బొమ్మలాగ ఉంది హంసావళి.

హంసావళిని చూచి భీమభటుడు పంచబాణుని సంరంభంతో కలతపడి పోయాడు, చంద్రకాంతికి ఆటుపోటు వచ్చే పాలకడలిలాగ. హంసావళికి భీమభటుణ్ని చూచినది మొదలు మనస్సులో మన్మథుడు బలంగా నాటుకున్నాడు. ఆ తాపం భరించలేక హంసావళి తనపేరుకు తగినట్టు తామర రేకుల పక్కను ఆశ్రయించింది.

ఆమె తాపం చూడలేక దూతికలు ఒక ఉపాయం ఆలోచించారు. అతడు ఎవరు 'ఏమి, ఎక్కడివాడు, ఏమిచేస్తున్నాడు' అనే సంగతులు తెలుసుకొన్నారు. హంసావళి అనుమతితో అతనిని ఆమె అంతఃపురానికి పిలుచుకొని వచ్చే ఏర్పాట్లు చేశారు.

భీమబలుడు తన అనులోమ ప్రతిలోమ విద్యతో ఇతరుల కంటబడకుండా కన్యాంతఃపురం చేరాడు. అంతఃపురం రత్నదీపాల పచ్చని కాంతితో వెలిగిపోతూంది. దివ్యగంధ ధూపంతో కమ్మని వాసనలు వ్యాపిస్తున్నాయి. భీమభటుడు చక్కని కన్నుల ఆ హంసావళిని గాంధర్వ వివాహ పద్ధతిని చేపట్టాడు.

భీమభటుడు ఆలింగనం చేసుకోగానే హంసావళి సుందర తనూలత కంపించింది. సిగ్గుతో కన్నులు మూతపడి

పోయాడు. ఆమెకు అపూర్వమయిన ఆనం దానుభూతి కలిగింది. భీమభటుడులాగగానే ఆమె మొలనూలు గలగల ధ్వనిస్తూ, వారి పరస్పరానంద నాటకానికి ప్రస్తావన పాడినట్లయింది. ఆమె తలకట్టు నుండి జారిన పుష్పాలు, కుసుమ్మరేకలు జామ్మాం టుండగా వారికి సత్కారం చేయడానికి గుమ్మపులలాగ ఉన్నాయి. ధైర్యానికి ఆయత్తం కానిది, సిగ్గుకు గోచరం కానిది, ఆలోచ నకు మించినది అయిన సుఖం వారు అను భవించారు.

తెల్లవారింది. భీమభటుడు తన విద్యా మహాత్మ్యంతో సగరు పదలి వెళ్లి పోయాడు. హంసావళి ఆవులిస్తూ పక్క నుంచి లేచింది. ఆ కన్నులు ఎర్ర జీరలతో కొత్త అందంతో వెలిగాయి. ఏనుగు కద లించిన తామర తీగలాగ కదలిపోయింది.

అంతఃపుర రక్షకులు రాజకన్య వాలకం చూచారు. ఏమిటో అనాహుతం జరిగిం దని శంకతో రాజుకు పరిస్థితి విన్నవిం చారు. రాజు రెండవనాడు కన్యంతఃపురానికి గట్టి కాపలా పెట్టారు. ఆ భీమభటుడు రాగానే అతనిని కావలవాళ్ళు పట్టుకొని, రాజుకు అప్పగించారు.

రాజు అతని పుట్టుపూర్వాలు కను క్కొన్నాడు. అతడు అనురూపుడయిన వరు డని గ్రహించి తన కుమార్తెను అతనికి ఇచ్చి శాస్త్రోక్తంగా వివాహం చేశాడు. చంద్రాదిత్యునికి కుమారులు లేరు. కనుక అతని రాజ్యం కూడా భీమభటునికే సంక్రమించింది. పౌరులు కూడా దీనిని ఆమోదించారు శంఖదత్తుడు మొదయిన మిత్రులంతా అతనికి అండగా ఉన్నారు.

భీమభటుడు కొంతకాలానికి తన మిత్రు లతో ఆలోచించి, తన సోదరుడు సమర భటునివద్దకు రాయబారం పంపాడు, యుద్ధా నికి సిద్ధంగా ఉండమని, అతడు సిద్ధ పడ్డాడు. ఇద్దరూ పరస్పర బలాన్ని అధిక్షే పిస్తూ, కోపాన్ని ప్రజ్వరిల్లగా, తమ బల సముద్రాలను ఖడ్గాది శస్త్రాస్త్రతరంగ భీషణంగా సిద్ధపరచారు.

భీమభటుడు దృఢ నిశ్చయంతో రాధా నగరంపై దాడిజరిపాడు. పుష్కరావర్త మేఘాలవంటి అతని ఏనుగుల దండుతో దిక్కులు ఇరుకయిపోయాయి. అతని రణ భేరి కల్పాంతంలాగ గర్జించింది. ఆ గర్జ నకు నగరంలోని వనితలు సంభ్రమంతో అటూ ఇటూ పరుగెత్తారు. అప్పుడు వారి గంటల మొలనూలు ధ్వనించింది. వారు విలపించారా అన్నట్టుగా ఉంది ఆ ధ్వని. సమరభటుడు కూడా తన సైన్యంతో అన్నను ఎదిరించడానికి బయలుదేరాడు. అతని సైనికుల చేతి కత్తుల నీలపుకాంతి నల్లటి మేఘాలలాగ ఆకాశం అలము కుంది.

యుద్ధం ప్రారంభమయింది. స్వర్గానికి మెట్లవంటి, విజయలక్ష్మి కటాక్షాలలాగ రంగురంగుల కత్తులు భటులమీదపడ్డాయి. యుద్ధరంగంలో వైరమనే అగ్నిహోత్రం లో సుభటులనే యజ్వలు ధనుస్సులు అమ్ములువదలే చప్పుళ్లనే మంత్రాలతో, ఏనుగుల ఘీంకారాలతో యుద్ధ యజ్ఞం చేశారు. భూమిమీద దొర్లిపడిన శూరుల రక్తసిక్తమైన తలలు జయలక్ష్మి అడు గులు వేయడానికి వేసిన కలువల వరుసలాగ కనిపించాయి.

భీమభటుడు తన ప్రత్యర్థి అయిన సమరభటుని తలను కత్తితో నరికివేసి, కత్తి కొసకు తలనుగుచ్చి ఎత్తాడు. అది తన పరాక్రమ తరువు ఫలాన్ని అందరికీ చూపు తున్నట్టు అనిపించింది.

సమరభటుడు తన సహచరులతోపాటు మరణించగా, భీమభటుడు అతని రాజ్యం ఆక్రమించుకొన్నాడు. అంతఃపురానికివెళ్లి తన తల్లి మనోరథకు సమస్కరించాడు. శంకదత్తునికి ఉదారంగా లాటరాజ్యమిచ్చి, రాధానగరానికి తిరిగి వెళ్లిపోయాడు.

## ఉత్తరాలు రాసేవారికి మనవి

ఉత్తరాలు రాసేవారు ఈ కిందివి గమనించగోరుతాము.

— రచనలలో ఇంగ్లీషు లిపి వాడ రాదు.

— రాసేవారి పూర్తిపేరు చిరు నామా ఉత్తరంలో ఉండాలి. అంతా తెలుగు లిపిలోనే ఉండాలి.

— అన్ని ఉత్తరాలూ వ్యక్తుల పేర కాక సంపాదకుడు, ఆంధ్ర పత్రిక వారపత్రికకి రాయాలి.

—సంపాదకుడు

తర్వాత పంచగౌడ దేశాలను జయించి సకలదిక్కులూ జయించి గొప్ప సామ్రాజ్యా సంపాయించాడు. విలాసోద్యానానికి వెన్నెల వంటి హంసావళితో సుఖంగా ఉంటూ అంతా మరచి ప్రవర్తించాడు.

ఒకమారు తేజోనిధిఅయిన ఉత్తంక డనే ఋషి అతని కొలువుకూటానికి వచ్చాడు. అతని మాటతోనే భుజగల క్షయం అయింది. అతని దర్శనానికి భీమ భట మహారాజు ఆలస్యంగా వచ్చాడు దానితో ఉత్తంకునికి కోపంవచ్చి 'నీవి మదించిఉన్నావు. మదగజమయిపో' అని ఆ కామాలనున్నో శపించాడు.

భీమభటుడు అతనిని అనేకవిధాల ప్రార్థించాడు, శాప నివృత్తికోసం. రాజా నీవు మృగాంకదత్తుని మంత్రి ప్రచండ శక్తిని ఫలజలాలలో సత్కరించి సంతోష పెట్టి నీ సంగతి చెబుతావు. నాగ శాపంవల్ల అతనికి కళ్లుపోయాయి. అత నికి నీకు శాపవిమోచనం కలిగి గంధ ర్వత్వం కలుగుతుంది' అని శాపాంతం సెలవిచ్చి వెళ్లిపోయాడు. నేను వచ్చిన వారందరినీ ఫలజలాలతో సత్కరిస్తున్నాను. ఎవరు ప్రచండ శక్తో అని. ఆ భీమభటుణ్ణి నేనే ఆ దైవశాత్తు నీవు లభించావు. అన్నాడు.

ఈ మాటలు చెప్పగానే ఇద్దరికీ శాపాంతం కలిగింది. భీమభటుడు గంధర్వు డయ్యాడు. ప్రచండ శక్తికికూడా కళ్లు వచ్చాయి.

మృగాంకదత్తుడు ఈ అద్భుత వృత్తాంతం విన్నాడు. ప్రచండశక్తిని ఆలింగనం చేసుకొన్నాడు. భీమభట గంధ ర్వుడు మృగాంకదత్తునితో 'రాజకుమార త్వరలో నీకు శశాంకవతి లభిస్తుంది. నీకు నావల్ల ఎప్పుడయినా సహాయం కావలసివస్తే అప్పుడు స్మరించు. నేను ప్రత్యక్ష మవు తాను' అనిమాటఇచ్చి వెళ్లిపోయాడు.

మృగాంక దత్తునికి ఆనందామృత ప్రవాహంలో మునిగి నట్లయింది. పూర్వ జన్మలో శివుని పూజించడంవల్ల దివ్య గంధర్వుడయిన భీమభటునితో స్నేహం కలిగింది. ఐదుగురు మంత్రులు చేరారు. తక్కిన మంత్రులను కలుసుకొనే ఆశతో పయనం సాగించాడు.

(ఇంకావుంది)

# రౌడీ పిల్ల

(21-వ పేజీ తరువాయి)

కొడుకుగూడా థాంక్స్ అందజేసి వస్తున్నాం' అంది.

'మరి మాకు పార్టీ ఎప్పుడు?'

'ఏదీ? నువ్వసలు ఇంటికి రావడమే మానేశావుగా! నాకు పెళ్లి కుదిరి పోయిందితే! నువ్వు దాక్కోవాల్సిన అవసరంలేదు...'

ఆమె స్నేహితురాండ్రిద్దరూ కిలకిల నవ్వేశారు. నాకు చచ్చేంత సిగ్గువేసింది. వస్తానన్జెప్పి వెళ్లిపోయిందామె. ఇద్దరు ప్రాణస్నేహితుల మధ్య అభిప్రాయభేధాలు సామాన్యంగారావు. ఓ వేళవస్తే అది మర్చిపోయేంతవరకూ వాళ్లు కలుసుకోన్నప్పుడల్లా కలవకుండా ఉంటేనే బాగుండేదనిపిస్తుంది. సీత విషయంలో నేను చాలా తప్పుగా ప్రవర్తించానేమోనని అనుమానం నన్ను పీడిస్తూండేది. ఆమెనుంచి తప్పించుకు తిరగటానికి ఆ అనుమానమే కారణం అనుకొంటాను. గిల్టీ కాంషస్! ఓ వారం రోజులతర్వాత అమ్మ చెప్పింది. మరో పదిరోజుల్లో సీత పెళ్లిముహూర్తం నిశ్చయించారుట. పెళ్లికికూడా వెళ్లాలనిపించలేదునాకు. ఆమెని పెళ్లికూతురిగా ఓ వ్యక్తి ప్రక్కన చూడాలనుకోవడం బాధ అనిపించింది. పెళ్లిరోజువరకూ నాలో పెద్ద సంఘర్షణ జరిగింది. వెళ్లాలావద్దా అని. చివరకు వెళ్లడానికే నిశ్చయించుకొన్నాను. పదింటికి ముహూర్తం అనగా ఎనిమిదింటికి వాళ్లింటికి వెళ్లాను. సరాసరి లోపలికినడిచి సీత ఉన్న గదిలోకి వెళ్లాను. సీత ఓసోఫాలో కూర్చుని ఉంది. చుట్టూ మా బంధువులమ్మాయిలు కూర్చుని అల్లరి చేస్తున్నారు. బుగ్గన చుక్క, మెడలో చంద్రహారం, నుదుట పాపిడబిళ్ల వీటితో ఓ గంధర్వ కన్యలా మెరిసిపోతోంది సీత. నన్ను చూడగానే ఆమె ప్రక్కన కూర్చున్న ఇద్దరమ్మాయిలు లేచి మంచున్నారు. ఓక్షణంపాటు కాటుక పులుముకొన్న సీత కళ్లు వింత వెలుగుతో మిలమిలలాడినయి.

'రా! కూర్చో!' అంది మెల్లిగా.

ఆమె ప్రక్కనే కూర్చున్నాను.

'ఏయ్ సుజీ! మీ అందరూ ఓరెణ్ణిమిషాలు బయటికి పొండే! ఈ చిన్నాడితో కొంచెం రహస్యాలు మాట్లాడాలి...' అంది సీత. వాళ్లు నవ్వుకొంటూ బయటకు వెళ్లిపోయారు. నాకు గాభరా వేసింది. తలుపు గడవేసివచ్చి నాదగ్గర కూర్చుంది సీత.

'నిజం చెప్పు! ఆనాడలా ప్రవర్తించానని నామీద కోపంవచ్చింది కదూ!' నాచేతులు తన చేతుల్లోకి తీసుకొంటూ అందామె. అప్పుడామె కళ్లనిండా నీరునిండి వుంది. గొంతుకూడా జీరవోయింది.

'చిన్నా! నాసంగతి నీకు పూర్తిగా తెలుసు. నేనెవ్వరికీ భయపడను. ఏ విషయమూ దాయను. నాకు చెప్పుకోదగ్గ స్నేహితురాండ్రెవ్వరూ లేరు. చిన్నప్పట్నుంచీ ప్రాణస్నేహితునిగా భావించింది నిన్నొక్కడినే! ఏ విషయమూ, ఎంత చిన్నదయినా సరే నీదగ్గర దాయలేదు. నాకు తెలీకుండానే నిన్ను నా హృదయంలో నిలుపుకొన్నాను. నీదగ్గరున్న చనువు, అధికారం, ప్రేమ మరెవ్వరిమీదా నాకు లేవు. నిజం చిన్నా! ఆఖరికి మా అమ్మా నాన్నలదగ్గర కూడా! కాని ఆ చిన్నవిషయం గురించి నువ్వు నాదగ్గరకు రావడం మానేశావ్! నన్ను తప్పించుకు తిరుగుతున్నావ్! నా మనసులోని విషయాలు ఇంక నేనెవరితో చెప్పుకోగలను? ... ఓ వేళ... ఆ రోజు...నాదే తప్పయితే...నన్ను క్షమించు చిన్నా ... అంతేకానీ ... ఇలా నన్ను ... దూరం చేయకు...' ఆమె కళ్లనుండి కన్నీరు జలజలా రాలింది.

'...నేను నిన్ను కోరేది ఒక్కటే! నేను బ్రతికున్నంతకాలం నువ్వు నాకు తరచుగా కనబడుతూండాలి. లేకపోతే ... నేనే నీ దగ్గరకొచ్చేస్తాను...తెలిసిందా?...నే ననుకొన్నవేవీ ఎలాగూ జరగలేదు ... కనీసం ఇదయినా జరగనీ...ఏం?...' ఆఖరి మాటలంటున్నప్పుడు ఆమెకి దుఃఖం ఆగలేదు. నా హృదయంమీదకి ఒరిగిపోయి వెక్కివెక్కి ఏడ్చేసింది. ఆమెని చూస్తుంటే నాకూ దుఃఖం ఆగలేదు. జీవితంలో, ఊహ తెలిసింతర్వాత, అప్పుడు మొదటిసారిగా నేనూ ఏడ్చేను.

'ఏడవకు సీతా! లే! ప్లీజ్!... ఇంకెప్పుడూ ఇలా చేయను...లే!' రుమాలుతో ఆమె కన్నీళ్లు తుడిచాను. కొంచెం సర్దుకొందామె.

'నీమీద కోపమేమిటి! అలా ఎందుకనుకొన్నావ్? నీ కోరిక తీర్చలేకపోయినందుకు నామీద అసహ్యంవేసి నీక్కనబడలేదు... అంతే!'...సీత లేచి నుంచుంది.

నేను వెళ్లి తలుపు తీసివేశాను.

'రహస్యాలు అయిపోయినయ్యా?' అంటూ సీత చుట్టూ మూగారు అమ్మాయిలు.

'నేను వెళ్తాను సీతా!' అంటూ బయటికి వచ్చేశాను. పెళ్లి పందిట్లోకి వచ్చేసరికి ఓ అమ్మాయి నావంకోసారి ఎగాదిగా చూసి, నవ్వుకొంటూ వెళ్లిపోయింది. ఖంగారుపడి నన్ను నేను పరీక్షగా చూసుకొన్నాను. గుండెలదగ్గర నల్లగా కాటుక ముద్రలు పడినయి. చచ్చేంత సిగ్గువేసింది. వెంటనే ఇంటికి పరిగెత్తాను.

పెళ్లి అయిపోయింది. సీత భర్తతో మాట్లాడాను. అతను చాలా హుందాగా, ఆకర్షణీయంగా వున్నాడు. నన్ను నేనే పరిచయం చేసుకొన్నాను, సీత నాకు వదినవుతుందనీ, ఇద్దరం చిన్నప్పటినుంచీ కలిసి పెరిగామనీనూ!

'సీత క్లోజ్ ఫ్రెండ్‌తో కలవడం చాలా సంతోషంగా వుంది!' అన్నాడతను. మర్నాడు సీత హైద్రాబాద్ వెళ్ళిపోతూంటే బస్‌స్టాండ్ వరకూ నేనూ వెళ్లాను.

'నన్ను మర్చిపోవుకదూ! ఉత్తరాలు వ్రాస్తూండు...'

ఎవ్వరూ వినకుండా వీలుచూసుకొని అంది సీత. తల ఊపాను: బస్ కదిలింది. సీత కర్ఛీఫ్ వూపింది. బంగారు బస్‌స్టాండ్‌లో అనేకమందికి వీడ్కోలిచ్చేను. కాని సీత వెళ్లిపోయింతర్వాత ఆ వూళ్లో మరింక నాకెవ్వరూ లేరనిపించింది. తర్వాత కొన్నిరోజుల వరకూ నేను మామూలు మనిషిని కాలేక పోయాను.

ఆ సంవత్సరంలోనే సీత రెండుమూడు సార్లు అతనితో కలసి వచ్చింది కానీ, ఒంటరిగా మాట్లాడ్డానికి నాకు అవకాశం దొరకలేదు. అదివరకటి ఉత్సాహం చురుకుతనం ఆమెలో లోపించినట్లు అనుమానం కలిగింది నాకు. ఆమెకు మొగపిల్లాడు కలిగినట్లు ఓ రోజు అమ్మ చెప్పింది. సంతోషం ప్రకటిస్తూ వాళ్లిరికీ ఓ కవరు వ్రాశాను. కాని ఎటువంటి జవాబూ రాలేదు. బి. ఏ. అయింతర్వాత వైజాగ్‌లో ఎమ్మే చదవటానికి వెళ్లాను. అప్పుడో సారి ఆమె క్షేమ సమాచారాల గురించి ఉత్తరం వ్రాసేను. దానికీ జవాబులేదు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఆరోజు

తగా చెప్పిన సీత ఎందుకింత నిర్లక్ష్యం చేసిందో అవగాహన కాలేదు. శెలవుల్లో ఆమెని చూడ్డానికోసారి హైదరాబాద్ వెళ్దామనిపించి, నేను ఫలానా రోజున వస్తున్నాననీ, బస్‌స్టాండ్‌కెవరయినా వస్తే బావుంటుందనీ, ఇంటి నుంచి లెటర్ వ్రాసేను. దీనిక్కూడా జవాబు లేదు. వెంటనే ప్రయాణం విరమించుకొన్నాను. బహుశా ఆమె ఇప్పుడు నన్నూ, గడచిన రోజులనూ మర్చిపోయి వుండొచ్చు.

పరీక్షలు వ్రాసింతర్వాత రిజల్ట్స్ కోసం ఎదురుచూస్తూ ఇంట్లో కూర్చున్నాను. ఓ రోజు సాయంత్రం బయటకి పోవడానికి తయారవుతూండగా టెలిగ్రాం వచ్చింది. సీత భర్త ఇచ్చాడది.

'సీత సీరియస్ స్టార్ట్ ఇమీడియట్లీ...'

అకస్మాత్తుగా ఇంత ప్రమాదం ఎందుకయిందో! అత్తయ్యావాళ్ళు సీతదగ్గర కెళ్ళి నాల్రోజు లవుతోంది సీతకి ఓవేళ అప్పటినుంచే ఏదయినా జబ్బుగావుందా? ఏదీ అర్థంకాలేదు. ఆ రాత్రే బస్‌కి బయల్దేరేను. బస్ ఎక్కుతోంటే పెళ్ళయిన సీత, భర్తతో హైదరాబాద్ వెళ్ళిన రోజు గుర్తుకొచ్చింది. నాకు తెలీకుండానే కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయి. బస్ పోతూంటే చాలా సేపటివరకూ భగవంతుణ్ణి ప్రార్థిస్తూ గడిపాను 'సీత వెంటనేకోలుకోవాలని.'

హైదరాబాద్ చేరేసరికి ఉదయం అయిదున్నర అయింది. ఆటోరిక్షాలో ఓ అరగంట వెదికి సీత ఇల్లు చేరుకున్నాను ఇంట్లో ఇంకా లైట్లు వెలుగుతోనే వున్నయి. హాల్లో సీతభర్తా, మామయ్యా కూర్చుని ఉన్నారు. నన్ను చూడగానే అతను లేచి నా దగ్గర కొచ్చేడు.

'మీరు కొంచెం ఆలస్యంగా వచ్చేరు! రండి!' అంటూ లోపలికి దారితీశాడు. నా శరీరమంతా వణుకుతోంది. చెమటలు పడుతున్నయి. అడుగులు తడబడుతూండగా అతని వెనక నడిచాను. గదిలో మంచం చుట్టూ నలుగు రయిదుగురు ఆడాళ్ళు నుంచునిఉన్నారు. అత్తయ్య ఓ మూల కూర్చుని రోదిస్తోంది. సీతమీద కప్పిన దుప్పటి తొలిగించి చూశాను. ప్రశాంతంగా నిద్రపోతున్నట్లుం దామె ముఖం. నా కళ్ళవెంబడి నీళ్ళు రావటంలేదు. జరుగకూడనిది జరిగిపోయింది. గుండెలు పిండేస్తున్నట్లు బాధ మనసంతా ఖాళీ అయిపోయింది. బాగ్ తీసుకొని బయటకు నడిచాను. అతను గేటువరకూ వచ్చాడు నాతో. అక్కడ ఆగి అన్నాడు.

'మీతో కొంచెం మాట్లాడాలి!'

ఆగి అతనివేపు తిరిగాను. నాకేమీ వినాలనిపించటం లేదు. నా జవాబుకోసం అతను ఎదురు చూడలేదు.

'సీతని నేను అన్యాయంచేశాను. ఆమెని చిత్రవధ చేశాను. నాకు తెలుసు నేనేమి చేస్తున్నదీ! కాని నిస్సహాయుణ్ణి! భార్య ఇంకో పురుషుడిని అదివరకే ప్రేమించిందనీ, ఇంకా అతన్నే ఆరాధిస్తోందనీ తెలిస్తే ఏ మొగాడు సహించగలడు? తన సంగతెలా ఉన్నా తన భార్య మాత్రం తననే ప్రేమించాలనీ, మరో పురుషుడిని కన్నెత్తి చూడకూడదనీ ప్రతి మొగాడూ కోరుకొంటాడు కానీ నన్నుసీత నిర్లక్ష్యం చేసింది. తను నా భార్యలా మెలిగేదికాదు. మనసిచ్చి ఎప్పుడూ మాట్లాడలేదు. నేను నిలదీస్తే చాలారోజుల తర్వాత చెప్పింది. తను మిమ్మల్ని ప్రేమించినట్లు, తన హృదయంలో మరొకరికి చోటులేనట్లూ! ఇక్కడే, అప్పటినుంచే నేను దయాదాక్షిణ్యాలు మిగలని పశువుగా మారిపోయాను. బార్‌లో త్రాగివచ్చి, రోజూ రాత్రిళ్ళు ఆమెని చావమోదేవాణ్ణి. చాలాసార్లు స్పృహ దప్పేంతగా కొట్టాను. మీ దగ్గర్నుంచి వచ్చిన ఉత్తరాలన్నీ చింపి అవతల పారేశాను. అప్పటినుంచీ ఆమె తెగించింది. ఎదురు తిరిగి జవాబులిచ్చేది నాకు. ఆమె అంటే నాలో కసి పెరుకు పోయింది. కొద్దిరోజుల క్రితం ఆమె సూట్‌కేసులో మీ ఫొటో కనిపించింది నాకు. ఆమెని చాలా తీవ్రంగా హింసించాను. ఆమె గడపకు కొట్టుకొని పడిపోయింది: తలకి పెద్ద గాయమయింది. ఆ తరువాత నాలుగురోజులు సీత మూసిన కన్ను తెరవకుండా పడి వుంది. వాళ్ళమ్మా నాన్నా వచ్చి డాక్టరుని పిలిపించారు. నిన్నంతా మీ పేరే కలువరిస్తోంది. డాక్టరు పెదవి విరిచిం తర్వాత మీ కోసం టెలిగ్రాం ఇచ్చాను. కనీసం ఆఖరి గడియల్లో మీరామెను చూడగలరనుకొన్నాను...'

టాక్సీని పిలిచాను. బాగ్ లోపలపెట్టి కూర్చున్నాను. అతను కిటికీ దగ్గరకొచ్చాడు. అతని కళ్ళవెంబడి నీళ్ళు కారుతున్నయి.

'నేను రాక్షసుణ్ణే! ఒప్పుకొంటాను. కాని నేనలా మారడానికి కారణం మీరు కూడా! సీత మిమ్మల్ని ప్రేమించింది. మధ్యలో ఏమీ తెలియని నన్ను చేసుకొంది. జీవితం మీద ఎన్నో కోరికలూ కలలూ నింపుకొన్న నా జీవితం నరకం చేసి, నన్నో రాక్షసుడిగా మార్చింది ... అందుకు ప్రతిఫలం అనుభవించింది ... దీనంతటికీ కారణం...మీరు...మీరు...'

టాక్సీ కదిలింది. హఠాత్తుగా నా దృష్టి గేటుప్రక్కనే నుంచునిఉన్న ఓ మూడేళ్ళ కుర్రాడిమీద పడింది. చిన్న నిక్కరూ చొక్కా వేసుకొని నా వంకే చూస్తున్నాడు. వాడినిచూసి ఉలిక్కిపడ్డాను వాడు అచ్చం నాపోలికే.

టాక్సీ మలుపు తిరిగింది. ఆఖరుసారిగా వెనక్కు తిరిగి చూశాను. అతను పిచ్చివాడిలా జుట్టు పీక్కొంటున్నాడు. నా హృదయం మీదగా వెచ్చని కన్నీరు జారిపోతోంది ...

'రౌడీపిల్ల ఇక లేదు' ●

## తెలంగాణా సమస్య - ఇతరుల అభిప్రాయాలు

ఇటీవలే ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఒపీనియన్ సంస్థ వారుచేసిన అభిప్రాయ సేకరణ ఇతర రాష్ట్రాలలో తెలంగాణా సమస్య లేక ఉద్యమం గురించి ఉన్న అభిప్రాయాలని గురించి కొంత తెలుపుతుంది. ఈ అభిప్రాయ సేకరణ బొంబాయి, మదరాసు, కలకత్తా, ఢిల్లీలో 1000 మందికిపైగా అడిగి చేసినదిట.

95 శాతానికి ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ఉందని తెలుసుట. కాని 64 శాతం ఈ ఉద్యమాన్ని ఖండిస్తున్నారుట. (బలపరిచేవారి సంఖ్య 19 శాతంట.)

రాష్ట్రపతి పాలన మంచిదని 50 శాతం అనుకుంటున్నారుట. మిలిటరీ పాలన కావాలని కోరేవారి శాతం 52 ట.

(కె. వి.)

**కె. పి. ఆర్, గొడిలంక**

ఒక రచనను ప్రచురణకు తీసికొని ఆ విషయాన్ని రచయితకు తెలియచేసిన పిదప ఆ రచనను ప్రచురించకపోవడం జరుగుతుందా ?

ఇదివరకు జరిగేది కాదు బ్రదర్, కాని ఈ రోజుల్లో చెప్పలేం. ఎందుకంటారా? ఒక ప్రముఖ ప్రచురణ సంస్థ ఒక యువరచయిత నవల అచ్చువేస్తామని చెప్పి, తరువాత తిరస్కరించారనివిన్నాను. మాటకి కట్టుబడే రోజులు కావేమో ఇవి అని పిస్తుంది.

**టి యన్. పి, వర్రాతాగబ్బి**

భార్యాభర్తలు ఎలాగు ప్రవర్తించాలి?
భార్యభర్తలవలె!

స్త్రీకి పురుషునకు గల సంబంధమేమి?
స్త్రీ పురుష సంబంధం!

పని లేనివాళ్ళు దొంగతనాలు, దోపిడిలు చేస్తే తప్పా ?

జనం ఎక్కువయ్యారని హత్యలు చేయడం తప్పు కాదంటే.... మీరనేది తప్పుకాదు! ఏమిటి ప్రశ్నలు? సిల్లీ.

**వి. టి, నాగలదిన్నె**

రామలక్ష్మిగారూ మీరు ఎక్కువగా స్త్రీల ప్రశ్నలకే జవాబులిస్తారని విన్నాను. ఇది నిజమా ?

మీరు విన్నది అబద్ధంసార్, నమ్మకండి.

**ఎస్. వి. ఆర్. ఆర్, కొల్లూరు**

'పిల్లల రచయితలు' ఎవరో కొన్ని చెపుతారా ?

ప్రతి నెలకి రోజుకి దగ్గర నుంచి పద్యాలు, గేయాలు, నవలలు, నాటకాలు, నాటికలు, కథలు, కథానికలు పెద్ద కథలు ఒకటేమిటి అనేకం రాశాం. అచ్చుపడ్డంలేదని నాహోయే ఉబలాటపరులందరూ....

**రంగాచారి, వాల్తేరు**

పెళ్ళి చూపులకు వెళ్ళినప్పుడు ఆ స్త్రీ సరైన శీలము కలదో కాదో తెలుసుకోవడం ఎలా? ఆమెను లేడీ డాక్టరు ద్వారా ఎగ్జామిన్ చేయించడం ద్వారా తెలుసుకోవచ్చు కదా?

అప్పకుండానా— రంగాచారిగారూ, అంతకుముందు తమ బుర్ర కూడా ఓసారి చెక్ చేయించండి— ఎందుకైనా మంచిది.

**పి వి. ఎల్, మొలగవల్లి**

పునర్జన్మ సిద్ధాంతంపై మీ అభిప్రాయం ఏమిటి?

ఈ జన్మకిది చాలనిపిస్తుంటే పునర్జన్మని గురించి ఆలోచించడం నాకు నచ్చదు.




**వాగీష్, నిర్మల్**

ఈ కరువు రోజులలో మీరు మీ పిల్లలు ఎన్ని పూటలు భోజనం, టిఫిన్ చేస్తారో తెలుపుదురా?

వారంలో నాలుగు రోజులు రాత్రిపూట టిఫిను చేయకపోతే రేషను సరిపోదు వాగీష్ !

**ఎస్ ఎ ఎమ్, కళ్యాణదుర్గం**

భర్తను లొంగదీసుకోవడం ఎలా అనే శీర్షిక మీకు నచ్చిందా? దానిపై మీ అభిప్రాయం ఏమిటి?

నచ్చడం ఏం కర్మ! పారాయణ చేస్తుంటేను!

**ఎస్. ఎస్. డి, కాకినాడ**

మీ కథల్లో ఎప్పుడూ పార్వతీ కృష్ణమూర్తు లేనా? మీ కథల కంటే నవలలే బాగుంటాయి నాకు.

పెళ్ళితో ప్రేమకు స్వస్తి అనీ, వైవాహిక జీవితంలో రాగరంజితమైన ప్రేమకు తావుండదనీ అనుకునే మీ బోంట్లకి పార్వతీ కృష్ణమూర్తులంటే నచ్చక పోవచ్చు. కాని అవి నిత్య నూతన దాంపత్యానికి చిహ్నాలని, ఆదరించేవారు లేకపోలేదు. నాటిని గురించి పోదరి నవని నిర్మల ప్రభావతి నడగండి.

**పి ఏ. ఎస్. పి, హైదరాబాదు**

అర్ధరాత్రి వేళ దేవుడు ప్రత్యక్షమై నీకు అందమైన భార్య కావాలా? చదువుకున్న భార్య కావాలా అని అడిగితే చదువుకున్న భార్య కావాలని కోరుకునే వారెంత పర్సెంటు?

ఎప్పుడూ ఈ లెక్కలు తీయలేదు గాని, ఎందుకావున చదువుకున్న భార్య [illegible] తోడుతుంది!

**బి. ఎమ్, అనకాపల్లి**

చదువులో జ్ఞాపకశక్తి తక్కువ అగుట వలన చాలా తక్కువ క్లాసులో ఉన్నాడు. పైకి రావాలంటే ఏం చేయాలి.

కొందరికి పుట్టుకతోనే తెలివితక్కువ తనం ఉంటుంది. 'రిటార్డెడ్' కండిషనువల్ల. అలాంటి వారికి కూడా ఇప్పుడు ప్రత్యేక పాఠశాలలు ఉన్నాయి. కొందరికి పూర్తిగా ఒళ్ళు బద్ధకంచేత బుర్ర పని చేయదు. అలాంటివారికి క్రమశిక్షణ తప్పించి మార్గంలేదు (అడపాతడపా ఒకటి వేసినా సరే.... అయినా స్కూల్లో చదువుకొనేలా చేయడమే) ఇంకో రకం తెలివితక్కువ వాళ్ళున్నారు. వీళ్ళు కంఠతా పట్టింది తప్పించి వ్రాయలేరు. స్వంత వాక్యం ఒక్కటి వ్రాయకుండా క్లాసులు కూడా తెచ్చేసుకుంటారు. ఇలాంటి తెలివితక్కువ వాళ్ళకి ఇప్పుడు కష్టం తెలియదు గాని నలుగురిలో పడ్డప్పుడు తెలుస్తుంది...... ఇంత రాశాను. ఇంతకీ మీ తమ్ముడి వయస్సెంత సోదరి?

**టి. ఆర్. కె, జి. సి హెచ్. ఎమ్.**

బహుశః మీ వయస్సెంతో తెలుపగలరు...

అర్ధంగా కూడితే నా వయస్సు వస్తుంది! — గ్రహించగలరు!

**హెచ్. ఎస్ వి, వత్తికొండ**

అక్బరయ్యా ముస్లిమ్ నిర్మాణంగా ఖ్యాతిగాంచిన భారతీయ కట్టడాలను గురించి నీ అభిప్రాయం?

తాజ్ మహల్ గురించేనా? అది ఎవరు కట్టితేనేం? ఎవరు కట్టిస్తేనేం? మన నమ్మినం వందువనా ఉంది. సంతోషిద్దాం.

**ఎ కె పి. విజయనాడ**

పాటివారు ఆకలితో ఛస్తుంటే, ఉన్నదానిని తిని యిష్టము వచ్చినట్లు పారేసే వారినేమనాలి? వారికి సాటివారి బాధతో ప్రమేయం లేదా? ఇక ఎన్నిరోజులకీ సంఘం మారుతుంది?

మన కంటికి తెలియకుండా సంఘం మారుతూనే ఉంది. ఇది విన్నారా? బొంబాయిలో ఒక భార్యాభర్త కలిసి అపూర్వమైన సంఘసేవ ప్రారంభించారు. వారు విందులకు విశేషాలకు కోరవెళ్ళి, ఆహార పదార్థాలు మిగిలినవిన్నే కరించి మురికివాడల బీదలకోసం పంచిపెడుతున్నారట. విందులలో అప్పుడే 'కంచాలలో చేయి కడగకండి' అంటూ మృదువుగా హెచ్చరికలు ప్రారంభం అయ్యాయిట. అంటే ఏమిటి? సాటి జీవుల కోసం పడే శ్రమ కాదా ఇది?.... లేక విందులే మానాలన్న విపరీత వాదులా మీరు?!

## విషం తాగి మరణించిన వివాహితులైన ప్రేమికులు

ఎట్రపయ్యనఅల్లి అనే గ్రామంలో (ధర్మపురి) అలమేలు అనే 20 ఏళ్ళ అమ్మాయికి పెళ్ళయిన కొన్ని రోజులలోనే తన భర్తంటే వెగటు పుట్టిందట. దాంతో తన భర్తతో తెగతెంపులు చేసుకుని పుట్టింటికి వచ్చేసిందట. పుట్టింట్లో వుంటున్న ఆమెకు మునుసామి అనే వివాహితునితో సంబంధం ప్రారంభమయి, దినదినాభివృద్ధి గాంచుతూ వచ్చిందట. ఇది ఆ యింటికి, యీ యింటికి తెలిసి, రెండిళ్ళ వాళ్ళూ దీన్ని వీల్లేదని గొడవ చేశారట. తమ ప్రేమని అపార్థం చేసుకుని, తమ యిద్దరి మధ్యా గోడలా నించున్న సంఘం మీద అసహ్యం పుట్టి విషం తాగి (అలమేలు యింటిలో ఒక గదిలో) ఒకరినొకరు కౌగిలించుకు పడుకుని చనిపోయారట. తమ నిశ్చయం దేశానికి వుత్తరం ద్వారా తెలియజేశారట.

* * *

మధురాంతకంలో ఒక గుడికి చెందిన రథం వున్నట్టుండి భగ భగ మండి తగులబడిపోయిందట. 90 సంవత్సరాల నుంచీ వున్న యీ దేవుని రథం ఆ విధంగా వున్నట్టుండి తగులబడడం దైవ మహత్మ్యమేమీ కాదనీ, ఇది కేవలం కుట్రల ఫలితమే అని అనుమానిస్తున్నారు. ఈ దారుణం వల్ల నష్టం సుమారు మూడు లక్షలుంటుందని, అంచనా వేశారు.

* * *




11 వ తేదీ రాత్రి సుమారు ఏ పన్నెండు మంది రామచంద్ర పుండరీక్ కదమ్ అనే ఆయన యింటికి వెళ్ళి, తలుపు తట్టారట. 'ఎవరు వారు' అని తలుపు తీసిన రామచంద్రని వాటేసుకుని, రడీగా వున్న టాక్సీలో ఎక్కించి తీసుకుపోయారట. 12 వ తేదీన ఆయన శవం మధుర—పైగాన్ రైల్వేస్టేషనుల మధ్య దొరికిందట. ఈయనకు 45 ఏళ్ళట. బొంబాయి ప్రాంతానికి చెందినవాడట యీయన. ఈ సంఘటన వివరాలింకా తేలలేదు.



## తిండి పెట్టక శిశువుని చంపిన పెళ్ళికాని జంట

పెళ్ళికాని ఏ జంట తమకు పుట్టిన శిశువును ఆహారం లేకుండా చంపిన నేరానికిగాను ఆ జంటక్కు 18 నెలలు జైలు శిక్ష విధించింది చట్టం. ఇంతే గాక, 'వీరిద్దరినీ విడివిడిగా ఒంటరితనం అనుభవించేలా జైలులో పెట్టాలి. వారానికి రెండు రోజులు ఆహారం యివ్వరాదు. తమకు పుట్టిన పిల్లకు ఆహారం యివ్వక చంపినందుకు వీరికి ఆకలి మంట ఎలా వుంటుందో తెలిసేలా చేయాలి.' అన్నారట జడ్జిగారు. ఇది సౌత్‌ఆఫ్రికాకు చెందిన పోర్ట్ ఎలిజబెత్‌లో జరిగింది.

## వివాహం కాని తల్లి దండ్రులు

తలిదండ్రులలో వివాహం కాని తలిదండ్రులూ అనే తెగ ఒకటుంది. కుర్రకారు చదువుకునే రోజుల్లో ఆ చదువు బోరు కొడ్తే కాలక్షేపం కోసం ప్రేమాయణంలో పడ్తారు. దీనివల్ల, అక్రమ సంతానం అభివృద్ధి అవుతుంది. ఈ విషయం మీద అమెరికన్ ప్రభుత్వం కొంత పరిశోధన జరిపి, కొన్ని వివరాలు బయటపెట్టింది. ప్రేమలో పడిన వారి వయస్సు 17 నుంచి 22 ఏళ్ళలోపే సామాన్యంగా వుంటోందని, యీ చర్యలలో మగవారు సామాన్యంగా తనకేమీ సంబంధం లేనట్టు పోవడం జరుగుతుందనీ, అయితే తమ ప్రేయసీల పిల్లలను తమ పిల్లలుగా భావించి, ఆ పిల్లలకు తండ్రులుగానూ, పిల్లతల్లులకు భర్తలుగానూ ఒప్పుకునేవారు అరవై ఒకటి శాతమైనా వుంటారట. సామాన్యంగా యీ రకం ప్రేమలు హైస్కూలు విద్యార్థి విద్యార్థినుల మధ్య వెలికేస్తున్నవని కనుగొన్నారు. ప్రేమను ఫలింప చేయడం సామాన్యంగా నలభై శాతం కారులలోనూ, 32 శాతం ఆడపిల్లల యిళ్ళలోనూ, 17 శాతం మగవారి యిళ్ళలోనూ, కేవలం 7 శాతం మాత్రమే హోటలు గదులలోనూ జరుగుతోందట— [illegible].

* * *

జూలై 25వ తేదీన రాత్రి 11—30 గంటలకు బెంగుళూరులో పందెం గుర్రాలశాల తగులబడిపోయి, 38 పందెంగుర్రాలు కాలి మసయిపోయాయట. [illegible]



'అన్నదమ్ములు'లో కృష్ణ, విజయనిర్మల

చిత్రసమీక్ష :

# అన్నదమ్ములు

కథలో బలమున్నా, కథ చెప్పినట్టు పాత్రలు వినకపోతే అది రసాభాస కాక మానదు. పాత్రలు ఉత్సాహంగా నడుచుకు పోతుంటే—కథ ఆ పాత్రల వెనక పరుగెట్టుకుంటూ రావడం పెద్ద విశేషం. పాత్రల బలంతోనే కథకి కూడా బిగువు ఏర్పడుతుంది. ఆయా పాత్రల్లో నటీనటులూ ప్రేక్షకుల హృదయాల్లో నిలబడతారు, చిత్రమూ నిలబడుతుంది. పాత్రల ద్వారా నటీనటులకీ వారి నటన ద్వారా పాత్రలకీ బంగారు మలామావేసిన చిత్రం డి. బి. యస్. డేగా ఫిలిమ్స్ వారి 'అన్నదమ్ములు'.

ఇద్దరన్నదమ్ములు! ఒక అనాథ ఇంట్లో ప్రవేశించి అన్నగా చెలామణీ అవడం తమ్ముడికి గిట్టదు. వానికి మరో ఇద్దరు చెల్లెళ్ళు. పెద్దవాడెప్పుడూ బుద్ధిమంతుడే అయివుంటాడు, ఇందులోనూ అంతే. తమ్ముడికి అన్నగారిమీద బొత్తిగా అర్థంలేని కక్ష! అన్నగారు ప్రేమించిన అమ్మాయిని పంతంగట్టి పెళ్లి చేసుకొంటాడు. అన్నగారు తమ్ముడికోసం, చెల్లెళ్ళకోసం ప్రేమించిన అమ్మాయినే కాదు, సర్వాన్నీ త్యాగం చెయ్యడానికి సిద్ధపడతాడు. క్లయిమాక్సులో కుటుంబ వ్యవహారాలు డ్రమెటిక్‌గా ఎదురు తిరిగినప్పుడు—అన్నగారి త్యాగాన్ని అందరూ గుర్తించి కథని సార్థకం చేస్తారు!

కృష్ణ నటనా చాతుర్యాన్ని బయటికి రప్పించడానికి తగినపాత్ర ఇందులో లభించింది. నేర్పుగా, అర్థవంతంగా నటించి కృష్ణ ఆ పాత్రని పోషించడంలో కృతకృత్యుడు కాగల్గాడు. తర్వాత చెప్పదగిన పాత్ర విజయనిర్మలది. ఆమె నటన కొన్ని సన్నివేశాలని మనసుకు హత్తుకుపోయేలా చెయ్యగల్గింది. పాత్ర ఎలాంటిదయినా దానికి రాణింపు తేగలనని చంద్రమోహన్ నిరూపించుకున్నాడు. రామ్మోహన్ అవధుల మేరకు బాగానే నటించాడు. చిత్రంలో ఒక ప్రధాన పాత్రని రాజ్‌బాబు సామర్థ్యంతో నిర్వహించాడు. సాక్షి రంగారావు నటన ఉత్తమస్థాయిలో వుంది. చంద్రకళ మనోహరంగా నటించి పాత్రకి వన్నె తెచ్చింది. కొత్తనటి సుమ భవిష్యత్తుకి మంచి సోపానాలు వేసుకున్నది. యువ నటీనటులతో మురిపించే ఈ చిత్రంలో యింకా గుమ్మడి, నాగభూషణం, నాగరాజ్, సంధ్యారాణి, మీనాకుమారి, పుష్పకుమారి, జ్యోతిలక్ష్మి మొదలైనవారు తదితర ముఖ్యపాత్రలని పోషించారు.

రామచంద్రరావు దర్శకత్వంలో చిత్రం కొంగ్రొత్తగా . . . వింది. మహదేవన్ సంగీతం పసందు . . . ంది. కెమెరా స్వామి. కె. రాధాకృష్ణమూర్తి సమర్పించిన 'అన్నదమ్ములు' చిత్రానికి నిర్మాతలు డి. బి. నారాయణ, డి. రామగోపాలరెడ్డి.

—సితరాజు

# సినిమా

## తెలుగుతెరకి కొత్త దర్శకుడు

తెలుగుతెరకు మరొక కొత్త దర్శకుడు రాబోతున్నాడు; ఆయన్ని పరిచయం చేస్తున్నవారు క్యారెక్టర్ నటుడు శ్రీ ప్రభాకరరెడ్డి; ఆయన దర్శకత్వానికికొత్తవాడయినా, పరిశ్రమకు పాతవాడే; ఆయన శ్రీ బి. రామినీడు, శ్రీ హేమాంబరధరరావులవద్ద సహాయకుడిగా నాల్గయిదు చిత్రాలకు పనిచేసారు; ఆయనపేరు శ్రీ లక్ష్మీదీపక్.

## కథారచయితగా, నిర్మాతగా మారిన నటుడు

శ్రీ లక్ష్మీదీపక్ దర్శకత్వం వహిస్తున్న చిత్రానికి శ్రీ నారాయణ నిర్మాత; ఈ సంస్థకు బి. ఎన్. ఫిలింస్ అనిపేరు; ఈ సంస్థకు శ్రీ ప్రభాకరరెడ్డి, శ్రీ కృష్ణయ్య మ్యానేజింగు పార్ట్‌నర్స్; వీరు నిర్మిస్తున్న సాంఘికానికి శ్రీ ప్రభాకరరెడ్డి కథకుడు; శ్రీ మద్దిపట్ల సూరి సంభాషణలు రాశారు. శ్రీ కోదండపాణి సంగీత దర్శకుడు, శ్రీ అనంతరామ్ కళాదర్శకుడు; ఈ చిత్రంయొక్క షూటింగు సెప్టెంబరు 21 న ప్రారంభ మవౌతుంది; ఇప్పటికి అయిదుపాటలు రికార్డు చెయ్యబడ్డాయి; చిత్రంలోని ముఖ్య భూమికలను శ్రీయుతులు కృష్ణ, వాణిశ్రీ, గుమ్మడి, పద్మనాభం, రావిశాల, గీతాంజలి, సూర్యకాంతం, రామకృష్ణ, అభినయిస్తున్నారు. చిత్రంలోని మరొక హీరోయిన్ పాత్రను ఒక ప్రముఖతార నిర్వహించగలదని తెలుస్తూంది. ఈ చిత్రానికి 'పచ్చని సంసారం' అని పేరు పెట్టారు

## 'మాతృమూర్తి అయిన శ్రీమతి సుశీల'

దక్షిణభారత గాయకీ మణుల్లో అగ్రగామిగా ప్రశంసింపబడే శ్రీమతి సుశీల ఎన్నో చిత్రాలలో జోలపాటలు పాడిన విషయం మనందరికీ తెలుసు. ఆ భగవంతుడు యిన్నేళ్ళకు శ్రీమతి సుశీల ప్రార్థనను ఆలకించి కరుణించాడు. ఆమె నిండు చూలాలుగావున్నా ఆగస్టు మొదటివారం వరకూ చిత్రాలలో (నిర్మాతలకు సహకరిస్తూ) పాడుతూనే వుంది.

మీ పాపని
జలుబుతో
బాధపడనిస్తారా?

అక్కరలేదు..!

**విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది. ముక్కు దిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాప హాయిగా, చక్కగా నిద్రపోతుంది.**

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయమన్నాం. ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:


బయట-చర్మం మీద


లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది. హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




**విక్స్ వేపొరబ్ - జలుబుబాధలకి ఆధునిక ఔషధం**



'ఉక్కుపిడుగు'లో విజయలలిత

శ్రీమతి సుశీల మద్రాసులో కళ్యాణీనర్సింగ్ హోంలో ఆగస్టు 13 వ తారీఖున మగ శిశువును ప్రసవించారు. చిరంజీవి ఎర్రగా, అందంగా వున్నాడు; పిల్లవాడి బరువు 6½ పౌన్లు; తల్లి, బిడ్డ ఆరోగ్యంగా వున్నారు.

జానకి, విజయనిర్మల

అక్కా చెల్లెలు

'షావుకారు' తెలుగు, తమిళచిత్రాల్లో నాయిక పాత్రను ధరించిన శ్రీమతి షావుకారుజానకి, శ్రీమతి విజయనిర్మల జగపతివారి పాంఘిక చిత్రంలో అక్కా చెల్లెలుగా నటిస్తున్నారు. ఈ చిత్రానికి

## సినిమా

శ్రీ అక్కినేని సంజీవి దర్శకుడు; కుటుంబ కథలను అపేక్షించేవారికి 'అక్కాచెల్లెలు' చిత్రం నచ్చుతుంది. అక్కయ్య పాత్రను తమిళంలో శ్రీమతి జానకి అద్భుతంగా పోషించారు తెలుగులోకూడా అదేపాత్ర పోషిస్తున్నారు. తమిళంలో చెల్లెలి భూమికను శ్రీమతి కె ఆర్. విజయ ధరించారు తెలుగులో శ్రీమతి విజయనిర్మల ఆ పాత్రను పోషిస్తున్నారు; ఈ చిత్రంలోని కథానాయకునిపాత్ర విచిత్రమయినది, వింతయినది; ఈపాత్రను శ్రీ అక్కినేని నాగేశ్వరరావు పోషిస్తున్నారు. చిత్రంలోని ఇతర ముఖ్య భూమికలను శాంతకుమారి, నాగభూషణ, అల్లు రామలింగయ్య రమాప్రభ మరియు విజయలలితలు ధరిస్తున్నారు. ఈచిత్రానికి శ్రీ ఆత్రేయ మాటలను, శ్రీ మహదేవన్ సంగీతాన్ని, శ్రీ ఎస్. వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు. చిత్రంలోని పాటలను శ్రీయుతులు ఘంటసాల సుశీల పాడారు. నిర్మాత శ్రీ వి కృష్ణప్రసాద్. ఆచిత్రాన్ని మీకు చూపించే బాధ్యతను తీసుకున్నది లక్ష్మి పంపిణీ సంస్థ. ఈచిత్రం షూటింగు హైదరాబాదు సారథి స్టుడియోలో జరుగుతున్నది.

హాస్యనటిగా ప్రవేశించి

కథానాయిక స్థానాన్ని

అందుకున్న నటి

తెలుగు చిత్రాలలో హాస్యనటిగా ప్రవేశించిన ఒకనటి నేడు కథానాయికగా వెలుగొందు తున్నది; ఆమెధరించిన తొలిపాత్ర చిన్నదయినా, వున్నంతంలో ఉన్నతంగా నటించింది అన్నపేరును సంపాదించింది; ఆమె నటనాశక్తిని ఒక తమిళ నిర్మాత గుర్తించారు; కథానాయికగా పరిచయం చేసారు; మంచి మార్కులు సంపాదించి తమిళ ప్రేక్షకుల ఆశీస్సుల నందుకున్నది; తమిళ నిర్మాతల మెప్పును పొందగలిగింది. ఆపైన తెలుగులో నాయిక అయింది; ఆంధ్ర ప్రేక్షకుల అభిమాన నటి కాగలిగింది. ఆ తార ఎవ్వరోకాదు. మీరు గత రెండుమాసాల్లో చూస్తున్న వివిధ చిత్రాల కథానాయిక కుమారి వాణిశ్రీ.

గత రెండుమాసాల్లో ఆయిరంపోయ్, నిర్దోషి, తల్లైవన్ తమిళ చిత్రాలు విడుదలయినాయి. తెలుగులో జగత్ కిలాడీలు, ఆత్మీయులు, భలేరంగడు, నిండు హృదయాలు చిత్రాల కథానాయిక వాణిశ్రీయే. ప్రస్తుతం ఆమె ఇరవై తెలుగు చిత్రాలలోను, పది తమిళ చిత్రాలలోనూ ప్రముఖ హీరోలతో నాయికగా నటిస్తున్నదంటే— ఆమె నిర్మాతలకిచ్చే సహకారం, ప్రేక్షకులకు ఆమెపైగల అభిమానమే కారణం అనటం సముంజసం.

ముఖ్యపాత్రని ధరిస్తున్న

వర్ధమాన నటి

'అగ్గిదొర' వేషంలో ప్రతిభావంతంగా

## సినిమా డైరీ

● సంజీవిని ఫిలింస్ "గండరగండడు" షూటింగు ప్రసాద్‌లో జరిగింది. శ్రీయుతులు కాంతారావు, అనితలకు సంబంధించిన ప్రేమ పాటను శ్రీ కె. ఎస్. ఆర్. దాస్ చిత్రీకరించారు.

● పి. ఎస్. ఆర్. పిక్చర్స్ షూటింగులో శ్రీయుతులు ఎన్. టి. రామారావు, కె. ఆర్. విజయలకు సంబంధించిన ముఖ్య సన్నివేశాలను వాహినిలో శ్రీ విఠలాచార్య చిత్రీకరించారు.

● లలితాఆర్ట్సు వారి కొత్త చిత్రంలో శ్రీయుతులు శోభన్‌బాబు, వాణిశ్రీ, ప్రభాకరరెడ్డి పాల్గొన్న సన్నివేశాలను గోల్డెన్‌లో శ్రీ జి. రామినీడు చిత్రీకరించారు.

● మహాలక్ష్మి పిక్చర్స్‌వారి "శ్రీదేవి" చిత్రంలోని ముఖ్యసన్నివేశాల చిత్రీకరణలో శ్రీయుతులు హరనాథ్, కె. ఆర్. విజయ పాల్గొన్నారు. ఈ చిత్రానికి శ్రీ జి. ఎస్. నారాయణ దర్శకుడు.

● సురేష్‌మూవీస్‌వారి "సిపాయి చిన్నయ్య" షూటింగులో శ్రీ నాగేశ్వరరావు పాల్గొన్న దృశ్యాలను వాహినిలో శ్రీ జి. వి. ఆర్. శేషగిరిరావు చిత్రీకరించారు.

మీ తరుణ సౌందర్యాన్ని
పువ్వురేక మార్దవంగా
వుంచుకోండి




పాండ్స్ వానిషింగ్ క్రీమ్‌తో

పాండ్స్ వానిషింగ్ క్రీమ్‌లోగల ప్రత్యేక హ్యూమెక్టెంట్‌తో మీ చర్మమందలి స్వాభావిక తేమను వుంచుకోండి. పాండ్స్ వానిషింగ్ క్రీమ్ మీ చర్మాన్ని సుకుమారంగా మార్దవంగా నిత్య యౌవనంగా వుంచి కాపాడుతుంది. దుమ్ము, వాతావరణాలనుండి మీ చర్మాన్ని రక్షిస్తుంది. అతి తేలికగా మంచులా వుండే వానిషింగ్ క్రీమ్ ఒక్కటే సమానంగా రాసుకోవచ్చు. లేకపోతే పౌడరుకు పునాదిగా రాసుకొని పౌడర్ అద్దుకుంటే గంటలకొద్దీ మీ సింగారము చెక్కుచెదరదు

పాండ్స్ వానిషింగ్ క్రీమ్ పౌడర్‌కు విశిష్టమైన పునాది

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏలో స్థాపితమైనది)

# ఉత్తరాలు

( 4వ పేజీ తరువాయి)

25—7—69 సంచికలో మీరు ప్రచురించిన పై. యాదగిరిగారు వ్రాసినది చదువుటము తట స్థించినది. మొత్తము చదివిన తరువాత వాలో కొన్ని ఊహాలు పొందబడినవి. వారు వ్రాసిన ముఖ్యమైన కొన్ని తెలంగాణా ప్రజలకు మరల జ్ఞాపకము చేయ దలచుకున్నాను. (1) ఒక విద్యార్థి నాయకుడు, సాధారణంగా విద్యార్థి అనగా విద్యను అభ్యసించినవాడై వాడై వుండవలయును. అతడు ఉపన్యసించే సమయములో మన స్నేహితుడు యాదగిరి అక్కడ వుండ ము తటస్థించిందట— అతడు అతని ఉపన్యాసములో పోరగాళ్లు అనే పదము వాడాడట. ఇది ఎంత నిజమో నాకే కాదనుకుంట పాఠకులెల్లరికి తెలుసు. విద్యార్థి నాయకుడేమిటి, పిల్లలు అనే పదమునకు బదులు పోరుగాళ్ళు అనుట యేంది? విద్యార్థినాయకుడు ఆంధ్రవాళ్ళు చేసిన అత్యాచారాలు చెప్పే సమయములో మన స్నేహితుడు యాదగిరి గారు, వారు కూర్చున్న స్థలములో అవతారము (రూపము) మాత్రమే యున్నదిగాని మనస్సుమాత్రం ధ్యానంగా ఉన్నాదనుకుంట. ఆ పరధ్యానములో పిల్లకుబదులు పోరగాళ్ళు అని చెప్పినట్లు అపోహ పడ్డాడు పాపం. కాని మన మిత్రుడు యాదగిరి అపోహపడినదిగూడ న్యాయముగా వ్రాసి పత్రికలో ప్రచురిస్తున్నాడే గాని ఇగి తెలంగాణా ప్రజలను రెచ్చగొట్టినవారు కాదా! ఏదేని మనకు మనా స్వాతంత్ర్యము ఉన్నగి కాదా అని ఉన్నవి లేనివి కల్లబిల్లిగా వ్రాసి పత్రికలలో ప్రచురించి తెలంగాణ సోదరులను ఉద్రేకులుగా చేయుట ఎంతేని మీక (ఆంధ్రసోదరులకు) శ్రేయస్కరము కాదు. వీరు (యాదగిరి) తెలంగాణ ప్రజలు అమాయకులని వ్రాసినారు. ఇది తెలిసిగూడ అమాయకులను డబ్బు వ్యామోహము చూపించి వారి ఆస్తి, పొస్తులను తీసుకొని, పాపం వారికి ఉంటానికి గూడ నివాసము లేకుండా చేసి వారిదగ్గరనే నౌకర్లుగా ఉంచుకున్నారు. ఇది కాదంటారా! అనటానికి గూడా పెదవులు విప్పవనుకుంటా

ఇంతేకాకుండా వీరు (యాదగిరి) వ్రాసిన ఏమి తెలియని తెలంగాణ అమాయక ప్రజనికానికి డబ్బుతో ఉద్యమములోకి దింపారు అన్నారే, ఇది ముమ్మాటికీ తగని విషయము. ఎందుకనగా ఇప్పుడు తెలంగాణా ప్రజలందరు ఎన్. జి వో.లకి మొదలుకొని కూలి జనము వరకు ఉద్యమములో పాల్గొంటున్నారంటే డబ్బు వ్యామోహంతోనే పాల్గొంటున్నారని ఇలాంటి విషయములలో వీరారే (ఆంధ్ర) తలదూర్చి అమాయక ప్రజానీకాన్ని మోసం చేస్తారని వేరే చెప్ప నక్కరలేదనుకుంట

చివరికి మన యాదగిరి గారు మన తెలుగు సోదరులు సమైక్యంగా నిలిచి ఎదురించిననాడే తెలుగు తల్లికి సంతృప్తి కల్గుతుంది అన్నాడే, మన తెలంగాణా సోదరుడు చిన్నప్పరెడ్డి తమ లేఖలో అన్నదమ్ము లుగా విడిపోతున్నందుకు సమాధానంగా శ్రీ గరిగిపాటి సన్యాసిరాజు, బి. యస్. శాస్త్రిగారు వ్రాసిన లేఖలో ఎవరు ఎవరికి అన్నదమ్ములు, ప్రత్యేక తెలంగాణా, వుద్యమం, దానిని జరిపేరపద్ధతి దానివల్ల ఆంధ్రులకు జరుగుతున్న, జరిగిన అన్యాయాలు వ్రాయాలంటే పుస్తకాలు వ్రాయవచ్చు. వుద్యమ విధానాల లోని నిజానిజాలు బయటపడితే తెలంగాణా వారి పరువుకాస్తా పోతుంది అని వ్రాసారే, మనమిత్రుడు యాదగిరిగారు అలా వ్రాసారంటే, దానివలన తెలియునది ఏమనగా మనపై జరుపుచున్న జరిపిన అన్యాయాలు, తెలంగాణా సోదరులకు సహాయము చేస్తున్నామంటూ తెలంగాణాలో ఖాళీ వున్న ప్రతి జాబులో వాగే చేరుచూ, ఏమంటే మాకు పెద్ద పెద్ద డిగ్రీలున్నవని, తెలంగాణా సోదరులకు లేవనయు ఒకవేళ యున్నా మన ఆంధ్ర సోదరులు డబ్బులో మునిగితేలుతున్నారు కావు లంచముపెట్టి ఆఖాళీ ఉన్న జాబు చేచిక్కించుకుంటున్నారు. ఇది వారు చేస్తున్న సహాయం. ఇదివారు జరుపుచున్న అత్యాచారాలు ఏది ఏమైనప్పటికీ మీరుచేస్తున్న అత్యాచారాల నుండి విముక్తులై యెందుకు ప్రాణములైన లెక్క చేయకుండా పోరాడుతామని చెప్పుటకు వెనుకాడను.

కె. ఆర్. కృష్ణ, (సూర్యాపేట)

* * *

**ఊపిరి** లాడుతున్న ఆంధ్రుల అందాల రాజధాని భాగ్యనగరం ఈనాడు ఎంతటి దుస్థితిలో ఉందో ఎస్. ఎల్. దేవిగారు తమ 'శాంతికిలేఖ' (వ్యాసం ద్వారా ఆంధ్ర పాఠకలోకానికి ఎంతో చక్కగా అందజేసారు.

బి. యస్. రావు, (హైదరాబాదు)

*　　*　　*

'వాణిశ్రీ' ముఖచిత్రంతో అలరిన ఈవారం పత్రిక చూశాము. తెలంగాణా సోదరుల ఉత్తరాలు ప్రచురిస్తూ, పక్షపాత రహితదోరణి అవలంభిస్తున్నారు. యస్. వెంకటరంగారెడ్డి ఉత్తరానికి 'రాశి' సమాధానము వివేకవంతంగా లేదు. ఆంధ్రులు మదరాసులోకూడ ఆస్తులు పెంచుకున్నారన్న సమాధానము అర్థరహితం. ప్రాంతీయ సంఘ అనుమతి ఆంధ్రులు తెలంగాణాలో భూములు కొన్నప్పుడు తీసుకోవలసిన అవసరం, ఆవశ్యకత పెద్ద మనుషుల ఒప్పందంలో ఉంది. కాని తెలంగాణాలో భూములు కొనడాన్ని, మదరాసులో ఆంధ్రులు భూములు పెంచుకున్నారన్న దానిని పోల్చడం, నిజాలు తెలిసిన వ్యక్తి చేయవలసిన పని కాదు.

పన్నెండేళ్లలో జరిగిన అన్యాయాలు గూర్చి తెలంగాణా సోదరులు ఉత్తరాలు వ్రాస్తే 'రాశి' సమాధానాలు సమస్యలను ద్విగుణీకృతము చేయుచున్నవి. వారెప్పుడైనను ఇటీవల సుప్రీంకోర్టు కొట్టివేసిన ముల్కీ రూల్సును పదేపదే ప్రస్తావిస్తున్నారు. ఉత్తరాలు రాసే సోదరులు, ఇంతవరకూ జరిగిన అన్యాయాన్ని ప్రస్తావిస్తున్నారన్న మాట మరుస్తున్నారు.

ఏది ఏమైనా విశ్వస్నేహితానికి ప్రతీకగా నిల(వా) పత్రిక నిలుస్తుండడానికి సందేహము లేదు.

అనంత నరేందర్ రెడ్డి, (వరంగల్)

*　　*　　*

నేను రాశిగారినొక ప్రశ్న అడుగుతున్నాను. దానికి ముఖ్యంగా జవాబు చెప్పమనండి. నాగార్జునసాగర్ వల్ల మునిగిపోయిన తెలంగాణా ప్రాంత మెన్ని ఎకరాలు? ఎడమకాల్వ ఆయకట్టు (సాగు) ఎంత? కుడికాల్వ క్రిందఎంత? ఇకపోతే ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలోను తెలంగాణా ప్రాంతంలోను అవుతున్న సాగుఎంత? నిక్కచ్చితపు లెక్కలు రాశిగారి కలం నుండే కోరుతున్నాను.

స్నేహప్రియ, (హుజూర్‌నగర్)

# ఉత్తరాలు

* జవాబు

అన్ని విషయాలలోనూ 2:1 ఉండాలనీ, నాగార్జునసాగర్ విషయంలోనూ అంతేననీ ఈ విలేఖరి ఇంతకుముందు స్పష్టంగా రాశాడు!

1967—68 నీటి పారుదల సంవత్సరంలో నాగార్జునసాగర్ ఎడమ కాల్వలోకి సుమారు 77శ. కో. ఘ. అ. నీటినీ, కుడికాలువలోకి 74 శ. కో. ఘ. అ. నీటినీ వదిలారు. ఇవి అధికార వర్గంవారి వివరాలు.

తెలంగాణా విద్యార్థుల కార్యాచరణ సంఘంవారి కరపత్రంలో 90 శాతం సేద్యపు నీటి పారుదల ఆంధ్రప్రాంతానికి మళ్ళించబడ్డట్లు పేర్కొనబడిఉందని తెలుస్తోంది! యదార్థమయిన నిష్పత్తి ఇందు మించు 1 1లో ఉంది!!

ఇకసాగుబడి కావలసిన ఎకరాల అంకెలు ఈవిధంగా ఉన్నాయి. ఆంధ్ర— 11.5 లక్షల ఎకరాలు, తెలంగాణా 5.9 లక్షల ఎకరాలు. ఈ నిష్పత్తి ఇంచుమించు 2.1లో ఉంది.

కొన్ని సంవత్సరాలుగా ఎందరో మహనీయులు భారత దేశం అంతటా నీటి విలువ నీటి పారుదలకన్నా అధికంగా ఉండాలని, దానివల్ల ప్రాజెక్టులు దండుగ లవుతాయని చెబుతూనే ఉన్నారు!

ఈ సందర్భంలో మరికొన్ని లెక్కలు ఈ క్రింద చూడవచ్చు.

| | ఆంధ్ర | తెలంగాణా |
|---|---|---|
| బడులు | | |
| 1966—67 ... | 26,388 | 10,807 |
| 1956—57 మీద | | |
| శాతంహెచ్చు. ... | 23.80 | 40.60 |
| విద్యార్థులు | | |
| (లక్షలు) ..... | 24.88 | 6.29 |
| 1956—57 మీద | | |
| శాతం హెచ్చు ... | 24.70 | 25.80 |

పయి అంకెలనుబట్టి బళ్ళు ఉన్నా తెలంగాణాలో చదివేవారి సంఖ్య తగినంతగా పెరగలేదని తెలుస్తుంది!

అవకాశాలు ఉన్నా వాటిని వినియోగించటం అవసరం కదా!!

మునిగి పోయిన నేల వివరాలు వేరే వెతికి త్వరలో పంపటానికి ప్రయత్నం జరుగుతుంది! (ఒక పెద్ద ప్రాజెక్టు చీఫ్ ఇంజనీరు ఈ విలేఖరితో చెప్పినది— పెద్దపెద్ద ప్రాజెక్టులవల్ల మునిగిపోయే భూమి వైశాల్యం సాగుబడి అయ్యే భూమి వైశాల్యం కన్నా అంత తక్కువ ఉండదనీ, ఈ విషయంలో పాతకాలాలలో జరిగిన నిర్మాణాల మెరుగని, ఈ చీఫ్ ఇంజనీరు తెలంగాణాకి చెందినవారు!)

'ఓమ్ము' అంటే ఈ పూర్వో... పూసిరిపోల్చట... అది కుదరకపోతే ఈ సమాధానం ఏలుకానేకాదు!

—రాశి

*　　*　　*

26—7—69 సంచిక చూసాను. సి. వి. ఆ... బాబు. సన్యాసిరాజు బి. ఎస్. శాస్త్రిగార్ల ఉత్తరా... చదివాను. వారు తెలంగాణా ప్రజలపై నిం... వేయడమే మంచిదికాదు అని కోరుచున్నాను. ...గాణా ప్రజలకు అన్యాయాలు జరిగినవి లేనిది అ...రికి తెలిసినవే. కాని మాకు ఇప్పుడు కావలసి... ఆంధ్రప్రదేశ్ నుండి విడిపోవడమే కొద్ది ... దినములలోనే ప్రత్యేక తెలంగాణా సాధించగలము.

పుప్ప వెంకట్రావు, (హైదరాబా...

---

## పత్రాలోకం...

(47వ పేజీ తరువాయి)

స్కూలుకి వెళ్ళం అని ఏడ్చేపిల్లల... యిలాంటిదేదో జరిగి ఉంటుందని నిస్సం... దేహంగా చెప్పుకోవచ్చు. క్రమశిక్షణలో పెడుతున్నామనుకుని పిల్లల అభిమానాన్ని కోల్పోయేకంటే... నెమ్మదిగా బుజ్జగించి వారినో దారికి తేవడం మంచిది. చదువు... కునే పిల్లలకి ఇతరమైన సరదాలుండ... కూడదని భావిస్తారు కొందరు. పాప్ సాంగ్సు వింటూ ఫిజిక్సు పరీక్షకు తయారయ్యే నా స్నేహితురాలి కూతురిందుకు నిదర్శన. టీచెల్‌బాటమ్సు బెల్‌బాటమ్‌ప్యాంట్... వేసుకున్నా క్లాస్‌లో టాప్‌గా ఉండే కు... వాడు నిదర్శన. క్రమశిక్షణ అన్నది చిన్నతనంనుంచీ సెకండ్ నేచరుగా అలవాటవాలి. అది తల్లి చేయవలసిన అలవాటు. మితంగా తినడం, పరిశుభ్రంగా ఉండడంలాంటివి ఎలా అలవాటు చేస్తుందో—కొట్టి తిట్టకుండా చెప్పినమాట వినడంకూడా అలవాటు చేయకల్గాలి తల్లి. అప్పుడే నిజంగా తల్లే దైవం అనుకుంటారు.



**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

Regd. No. 4479: ANDHRA SACHITRA VARA PATRIKA



# ఆంధ్రసచిత్రవారపత్రిక

సెప్టెంబరు 1969

| ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | | | | |